# బాల్యవివాహతత్త్వసారము.

(లౌకికతర్కము.)



గ్రంథకర్త.

అచ్యుతుని వెంకటాచలపతిరావు.



ప్రకాశకుడు.

కనుపర్తి మార్కండేయశర్మ.

స్వధర్మప్రకాశినీ సంపాదకుడు.

బృందావనము, కీల్పాకం, మద్రాసు.

Printed at the Kesari Printing Works, G. T., Madras.

 1930 [వెల 1-0-0

ఈగ్రంథకర్తచే రచింపఁబడిన యితరగ్రంథములు (అచ్చగుచున్నవి.

వేదభూమి—ఆర్యావర్తమే వేదములకుజన్మస్థాన మనియు ఆర్యులు పరదేశములనుండి వలసవచ్చినవారు కారనియు నిరూపించ విమర్శగ్రంథము (ద్వితీయముద్రణ మగుచున్నది) రు 2-8-

బాల్యవివాహతత్త్వసారము—శారదాబిల్లుఖండనము. 1-0-

పాండవాంకురము (నాటకము) అశ్వత్థామని సౌప్తిక విజ్భ భణనుండి శ్రీకృష్ణుఁడు పాండవులఁగాపాడి బ్రహ్మశిరోనామకబాణాగ్ని సోకిన యుత్తరాదేవి గర్భమును రక్షించి పాండవవంశాంకురము నిల్పుట- (చదివితీరవలయును) 1-0-

అంపశయ్య (నాటకము) భీష్ముఁడు యుద్ధము చాలించి యం శయ్య బరుండి ముక్తిఁగన్నకథ. ఇందుఁగల కృష్ణలీలావర్ణనల దేహము పులకలెత్తించును (భక్తిరసభరితము.) 1-0-

మధుమురళి (చక్కనిగీతములు) (ప్రథమభాగము) 126 గీ ములు పారశీకకవి ఉమర్ ఖయాం వ్రాసినపదములకుఁ దేటతెలుఁగ (ఈమాసములో పూర్తియగును.) 0-8-

సుధాలహరి—భజగోవింద శ్లోకములకు నింకనిరస్తోత్రమ లకు మాత్రాసమ వృత్తములు. 0-8-

☞ ఈగ్రంథములు వలయువారిట్లువ్రాయవలయును:—

స్వధర్మప్రకాశినీ కార్యాలయము అచ్యుతుని వెంకటాచలపతిరావు
కీల్పాకం, మద్రాసు. గుంటూరు.

# ఉపోద్ఘాతము.

ఈకలియుగము ప్రారంభించి ఇప్పటికి ౫౦౩౦౫ సంవత్సరములు అయినది. కలియుగమునందు దాదాపు ౪ వేల సంవత్సరములు గడచిన కాలమునకే వర్ణాశ్రమధర్మ సంరక్షణమే తమజీవితమునకు పరమావధిగా తలంచిన ఉత్తమక్షత్రియ ప్రభువులచేతినుండి భారత రాజ్యలక్ష్మి తొలంగినది. నాటినుండి నేటివఱకు జైనులు, బౌద్ధులు, యవనులుమున్నగు ప్రభుత్వము వారెందఱో యీభరత ఖండమును పరిపాలించిరిగాని వారిలోకొందఱు మతసహనముగలవారును, కొందఱు మతసహనము లేనివారునుకూడ ఉండిరిగాని అట్టి యిరుతెగల ప్రభుత్వము వారలున్ను పాలితులగు ప్రజలమతాచారవిశ్వాసములను ప్రభుత్వాధికారముతో నిరోధించెడి దుష్టప్రయత్నముల నింతవఱకు నొనర్పలేదు. ఇంతలో మనయదృష్టవశమువలన పాలితులగు ప్రజల మతాచార విశ్వాసములందు సంపూర్ణమయిన సానుభూతిని చూపుటయే తమకు మొదటి ధర్మమని చాటించుకొను బ్రిటిషుప్రభుత్వమువారిచేతికి భరతఖండము చిక్కెను. తర్వాత ఎట్టివిద్యావిధానమును భారతీయుల కొసంగవలయునను సమస్యఅప్పటి పరిపాలకుల నెదుర్కొనగా వారిలో విల్లియంజోన్సు, మ్యాక్సుముల్లరు మున్నగు ప్రాచ్యవిద్యాపారంగతులు భారతీయనాగరకత అనాదిసిద్ధమయి వచ్చుచున్నదికనుక తద్దేశీయులకు అట్టివిద్యావిధానమే శ్రేయోదాయకము కావున ప్రాచ్యవిద్యాపద్ధతులనే బోధింపవలయునని వాదించిరి. మెకాలె, రామమోహనరాయుడు మున్నగువారలు ప్రాచ్యవిద్యయందు సారమేమియులేదనియు, పాశ్చాత్య విద్యావిధానమునం దెన్నియో రహస్యములు కలవు కావునను ప్రభుత్వమువారు పాశ్చాత్యులు కావునను పాశ్చాత్యవిద్యావిధానమునే బోధింపవలయుననియు వాదించిరి. చివరకు పాశ్చాత్య విద్యావిధానశిక్షణమే భారతీయయువకులకు బోధించుటకు ప్రారంభింబడెను. క్రైస్తవమతప్రచారకసంఘముకూడ భారతీయమతానిరసనము ప్రధానముగను, ఇంగ్లీషుభాషాబోధ అప్రధానము పాశ్చాత్య విద్యావిధానము ననుసరించి అచ్చటచ్చట పాఠశాలల కొల్పి భారతీయులగు బాలురకు బోధించుచుండిరి. పాశ్చాత్య విద

విధానమువలన యెట్టి మనోభావముగల విద్యావంతులేర్పడినది అట్టి విద్యావిధాన ప్రచారకులలో ప్రముఖుడగు "లార్డు మెకాలే" గారి లతోడనే చెప్పుచున్నాడను:—

"No Hindu who has received English education ever remains sincerely attached to his religion. Some continue to profess it as a matter of policy, but others profess themselves puristic and some embrace Christianity. We desire to form a class who may be interpreters between us and the millions we govern, a class of persons Indians in blood and colour but English in taste, in opinion, in morals and intellect."

(ఇంగ్లీషువిద్య నభ్యసించిన ప్రతిహైందవుడు తనమతాచారములకు తిన్నగా బద్ధుడై యుండజాలడు. కొందఱు యేదోఅయినట్టు పోయినట్టుగా లోకమునకు వెఱచి మతమునందు నామమాత్రముగా నిల్చియుందురు. కొందఱు గోడమీది పిల్లి వాటముగా సంచరించుచుందురు, కొందఱు క్రైస్తవులగుదురు. మనము పరిపాలించు నట్టి కోట్లకొలది జనులకున్నూ మనకున్నూ మధ్యవర్తులయి రంగుచేతను రక్తము చేతను మాత్రము హిందువులుగను, అభిప్రాయములలోను, అభిరుచులలోను, నీతి విధానములోను, బుద్ధిలోను ఇంగ్లీషువారిగను నుండు ఒక క్రొత్తజాతిని నిర్మించు టకే మనమీ విద్యావిధానము నవలంబించితిమి.)

ఇట్టిచిత్త సంస్కారముగల పాశ్చాత్యమానసపుత్త్రిలు ఆనాడధికార పదవులందున్న ఆంగ్లేయులతో ఆహారవిహారాది విషయములందు కలసిమెలసి చరించుచు తగిన పలుకుబడిని సంపాదించుకొని యున్నవారలు కావున తమతమ స్వేచ్ఛాప్రవృత్తివలన అనాదినుండి సంక్రమించుచువచ్చుచున్న ఆర్థికలాభములు పోకుండుటకుగాను, విధవా పునరుద్వాహ చట్టము, బ్రహ్మసమాజచట్టము, మతాంతరులకు దాయ విభాగమున్నగు చట్టముల నేర్పఱచుకొనిరి. కాని వారిలో విదేశీయ విద్యావిధానమువలన దేశముయొక్క ఆర్థికస్థితి నానాటికి క్షీణించుచున్న దని యెఱింగిన శ్రీయుత దాదాభాయి నౌరోజి మున్నగు భారతీయాభి వృద్ధికాములు పాశ్చాత్యవిధానము ననుసరించియే రాజకీయముగ పురో౽ భివృద్ధిని భరతవర్షమునకు కలుగజేయవలయునను మంచి తలంపు తోనేవారలు కాంగ్రెసు, అను నొక సంస్థను యేర్పాటుచేసి ౮౮ సం ల నుండి నిరంతరాందోళనము చేయుచుండగా తత్ఫలితముగా సుమారు ౧౦ సం॥ క్రిందట "మింటో సంస్కరణము" లనుపేర కొన్ని యధికా

ాసముల నొసంగిరి. ఆయధికారాభాసములు మనవారిచేతికి చిక్కి
కమునుపే "హిందూమతాదాయ పరిపాలన శాసనము" అను
తో దేవస్వాహరణము, శారదావివాహశాసనము, అనుపేరుతో
శాచార స్వాతంత్ర్యహరణము, మున్నగువానిని మనయీపాశ్చాత్య
నసపుత్త్రులు శాసనముగా నొసర్చి తమబుద్ధి వివేకమును లోకుల
మటగనంబఱచిరి. తమకుగల విద్యా, ధన, వివేక, అధికారములను
యాన్యాయ విచక్షణతయు, సత్యాసత్య విభేదములేక ప్రతిపక్షుల
దుపయోగించి తాత్కాలికముగ జయమునుగాంచుటయే పాశ్చా
విద్యావిధానముయొక్క పద్ధతి.

శారదా దుశ్శాసనప్రియుల దురాక్షేపణలు.

౧. బాల్యవివాహములవలన దంపతులకు పరస్పరము అనురా
శయ మేర్పడుచుండుట లేదనియు.

౨. ,, శిశుమాతృమరణములధికమగుచున్నవనియు

౩. ,, బుద్ధిహీనులును, దుర్బలులును అగు సంతానము కలుగుచున్నదనియు.

౪. ,, స్త్రీపురుషుల నీతిప్రవర్తనము సరిగాలేదనియు

౫. బాల్యవివాహముల నాచరింపక ప్రౌఢావివాహముల నాచ
మతావృలందు పైస్థితిగతులన్నియు చక్కగానున్నవనియు

౬. జనసముదాయము నందత్యధిక సంఖ్యాకులు పరంపరా
ప్తమైన బాల్యవివాహాచరణమునందునిరసనభావములో నున్నా
యు.

మనయీపాశ్చాత్య విద్యాధికుల వాదసారమైయున్నది.

ఈ గ్రంథకర్తయగు శ్రీ అచ్యుతుని వేంకటాచలపతిశర్మగారు
కుగల సంస్కృతాంధ్ర ఆంగ్ల భాషా పరిజ్ఞానమును సదుపయోగ
నర్చి, భారతీయులును, పాశ్చాత్యులును అగువిమర్శకులు వ్రాసిన

శ్రీయుత లాలా లజపతిరాయిగారి అన్హాపిఇండియా

,, యు. పి. కృష్ణమాచార్యులుగారి. రేమనలు ఆఫ్ అర్లిమారేజీ.

,, జస్టిస్ లింఢ్సేగారి రివోల్టు ఆఫ్ మోడరన్ యూత్.

,, కన్ హైలాలుగాభాగారి అంకుల్ షాం.

శ్రీయుత హావలాక్ ఎల్లిసుగారి సైకొలజీఆఫ్ సెక్సు.
,, బాబు చారుచంద్రమిత్రాగారి మారేజికొశ్చెన్.
,, గాలబి, ప్లైపెరదొరలువ్రాసిన మిడ్ వైఫరిశాస్త్రములు.
,, ఎట్టి యే కొటుదొరగారి సేఫుమారేజి.
,, వెస్టరుమార్కుగారి హిస్టరి ఆఫ్ హుమన్ మారేజి
,, డాక్టరు మేరిక్ బూతుగారి వుమెన్ అండు సొసైటి.
,, విటెకర్సు అల్మమనిక్కు.
,, ఎన్సైక్లొపీడియా బ్రిటానియా మున్నగు.

గ్రంథములను ప్రభుత్వమువారు ప్రకటించెడి సెంసను రిపోర్టుమున్నగు గ్రంథజాలమును, పాశ్చాత్యదేశములందు అప్పుడప్పుడు ప్రచురింపబడు రిపోర్టులను ప్రమాణములనుగా గ్రహించి పాశ్చాత్య విద్యావ్యామోహితులుపైన జూపించినదోషములన్నియుప్రౌఢావివాహముల నాచరించు సంఘములందే అత్యధికముగగలవనియు, బాల్యవివాహముల నాచరించుచున్న సంఘములందీదోషములు చాలస్వల్పముగాను న్నవనియు ఈగ్రంథమునందు ఋజువుచేసియున్నారు. వీరు 'వేదభూమి' యను గ్రంథమును రచించి ఆంధ్రప్రపంచమునందు వాసిగాంచియున్నారు. వీరు ఇంగ్లీషు చదివినను ప్రాచ్యవిద్యాపరిశీలనమునందున్నూ, ప్రాచీనులగు తమపూర్వుల యశోగానమును నలువైపుల వ్యాపింపజేయుటయందున్నూ దృఢాభినివేశముగల దిట్టలు, సంస్కృతాంధ్రముల యందు చక్కని కవిత్వశైలిగలవారలు. సంస్కృత, ఆంగ్లభాషలనుండి అనేక గ్రంథములొనర్చి ఆంధ్రభాషాసేవ జేసియున్నారు. ప్రకృతకాలమునం దిట్టి సంస్కృత, ఆంధ్ర, ఆంగ్ల భాషాభిజ్ఞులగు విమర్శ పలువురు భరతవర్షమునకు కావలసియున్నారు.

మన యాంగ్లమానసపుత్త్రిలు ఆంగ్లేయులయొక్క కార్యదీక్ష, ఐకమత్యము, కష్టసహనము మున్నగు సద్గుణముల ననుసరింపనేరక తత్సంఘీయులగు విమర్శకులు సంఘపునోవృద్ధి భంజకములుగా తలంచి తన్నిరాకరణమునకు బ్రయత్నించుచున్నను వారు విడనాడజాలక మిణికరించుచున్న స్వేచ్ఛావిహార వివాహ, వివాహవిచ్ఛేదముల, నవలంబించి తాము చెడి యితరులనుకూడ చెరుపదలచుట నింద్యము. ప్రతిపక్షులు చెప్పెడి యుక్త్యాభాసములన్నియు నిందు చక్కగా ఖండింప

యున్నవి కావున ఈబిల్లును నిషేధించుటకు ప్రయత్నించువారలంద
ఈగ్రంథమును చక్కగా ప్రప్రథమున పఠించిరేని ప్రతిపక్షులకు
కని సమాధానము నియ్యగలరని దృఢముగా చెప్పగలను.

.దావనం
ుపాకు,
ద రా సు.

ఇట్లు,
కనుపర్తి మార్కండేయశర్మ.
స్వధర్మప్రకాశినీ సంపాదకుడు.

---

బాల్యవివాహ తత్త్వసార గ్రంథముయొక్క

# విషయసూచిక.

---

పుటలు.

## ప్రథమాధ్యాయము. (పుట ౧–౨౬.)



## ద్వితీయాధ్యాయము. (పుట. 27-32.)



## తృతీయాధ్యాయము, (పుట, 33-66.)

## చతుర్థాధ్యాయము. (పుట. 67-78.)



## పంచమాధ్యాయము. (పుట. 79-96.)



## షష్ఠాధ్యాయము. (పుట. 97-116.)



---

N. KrishnaRao
2/2/1930.

# బాల్యవివాహ తత్త్వసారము.

## లౌకికతర్కము.

(శ్రీయుత అచ్యుతుని వేంకటాచలపతిరావు.)

శ్రీమత్కళ్యాణ వైభవోపేతమై దేశములన్నిటిలోఁ గీర్తిఁ గాంచి పుణ్యభూమియని సర్వజనులచేఁ గొనియాడఁబడుచున్న మన యార్యావర్తమునం దీనాటికి కుక్కగొడుగులవలె చిలిపిచట్టములు మొలకలెత్తి భారతీయుల మానసములందు నిర్భరంబగు భీతినిఁ గల్పించుచున్నవను విషయ మందఱికిని విశదమేకదా. ఇట్టి దుర్గతులకుఁ గారణభూతులు నవనాగరికులమని తప్పెటలు వాయించుకొనెడి సంఘసంస్కర్తలు. వీరు భరతఖండము—యొక్క గ్రహచారమువల్ల నిన్నటి వరకు ప్రతియూరిలో ప్రతిపల్లెలో కంఠశోషగా నుపన్యాసములిచ్చియిచ్చి సంఘమును తలక్రిందుసేయవలయునని కంకణముధరించిరి. ఈ సంస్కర్తలు తమ ధ్వంసపరాయణ విజృంభణ లచ్చటసాగక తమ సమాజములకుఁ దగిన యాదరణ ప్రజలొసంగమిం జేసి తెగబడి యేదోవిధముగా వోటర్ల కాళ్లు గడ్డములు పట్టుకొని శాసనసభలకెక్కి యచట వారి యకాల తాండవములగు సంస్కార విజృంభణలను సాగించిరి. ఈ సంఘపరిష్కర్తలలో కొందఱు ప్రవేశపెట్టిన పెట్టఁదలంచిన చట్టములింకమున్ముందెన్నెన్నియో మనము చూడఁగలము.

ఇప్పుడు బయలుదేరిన చట్టములు "గర్భాధానవయో నిర్ణయ శాసనము" బాలికావివాహ నిషేధశాసనము. మొదటిది సులభముగా నిరాఘాటముగా ప్రజలు "కుయ్యో" యని వలదనుచున్నను శాసింపబడినది. కాని వెఱ్ఱిచట్టముల నడిపించుటకు చేతగాక తిరిగి కలగించి మూసలోఁపోసి యూదుచున్నారు—ఇప్పుడొక విచారణసంఘము దేశసంచారముచేసి కొన్ని శిఫారసుల చేసియున్నది.

ఇట్లుండ నేటికి "బాలికావివాహ" శాసనము దాఁపురించినది. ఇది సనాతన ధర్మముల విధ్వంసముసేసి సంఘము నధోలోకమునందు ద్రోయ బయలువెడలినది. దీనివల్ల కలుగబోవు అనర్థములు:—

14 ఏండ్లుదాటని కన్యకు వివాహమొనర్చినంగాని
28 ,, బాలురకు ,,

రు 1000—జరిమానా, 1 సంll కఠినఖైదు విధించబడునట. ఔరా! ఎత్తుటయే గొడ్డంటిపెట్టు—

ఇంత ఘోరశాసన మిదివరకెన్నండైన కనివిని యెఱుంగుదుమే! విధవావివాహ శాసనము గావించినప్పు డిట్టిశిక్షావిధానముఁ బెట్టిరే! పెండ్లిజేసికొనక తిరుగబాటుజేసిన విధవలనందఱిని ఖైదులోవేసి జుల్మానాలు తగిలించవలయునని నాండే తోచకపోయెను గాబోలు. ఇట్టి దురాగతములఁ బ్రవేశపెట్ట నిచ్చుటగూడ బ్రభుత్వమువారి లోపమే గాని వేఱుకాదు.

ఇట్టిదుష్టశాసనమందు నేటినాగరక శిఖామణులు తమ ప్రేమాతిశయముంజూపుచు కంఠమెలుఁగురాయఁ బ్రగుమ్మరించు లౌకికతర్కములలోఁ గొన్నింటినిప్పుడు విమర్శింప దలంచితిమి.

I " దేశక్షీణత "(Degeneration)

బాల్య వివాహములవల్ల దేశము క్షీణించుననియు; అట్టి దంపతులకుఁ బుట్టువారు, మందబుద్ధులు, 3 దుర్బలులు, పిరికిపందలుగా నుందురనియు సంఘసంస్కర్తలుపెట్టెడి ప్రథమఘోష:—

There "arose a race of cribbed, cabined confined, and delicate creatures too fragile for the propagation of vigorous life and too ethereal and womanly to be of any earthly use."

"Rigvedic culture" P. 259.

1. జీవితమునందలి కార్యదీక్ష నడిపింపజాలని యబలులై, ప్రపంచకమునకెందుకును పనికిరాని వట్టిశూన్యులై, స్త్రీసమానులై నట్టియు, గిటసబారి ముడుచుకొని మూలకూర్చుండి, కాళ్లేతులుకట్టుబడి ముట్టుకొన్న రాలిపోవునట్టి యొకజాతి పుట్టుచున్నది.

చదువరులారా? ఇంత యననుకూలతర్క మెందైనకలదా ?

(1) బుద్ధిబలము.

ఇట్టి వివాహము లెన్నియో వేలకువేలేండ్లనుంచి వచ్చుచున్నవి. ప్రజలలో తెలివితేటలుగాని శౌర్యధైర్యములుగాని కొరంతపడియెనా?

బాల్యవివాహముల నవలంబించెడు ద్విజులలోనే, నేటికిని విద్యాధికులు కానంబడుచున్నారు. కలాశాలలలో జదువుకొనువారిలోగాని, పట్టపరీక్షలయం దుత్తీర్ణులైనవారిలోగాని సగటున బ్రాహ్మణులెందరో ఆలోచించి మీరే చూచుకొనుఁడు. రజోదర్శనానంతర వివాహమవలంబించెడి జాతులలో నెందఱుకలరో లెక్కవేసి చూచుకొనుఁడు. ఇంతయేల బ్రాహ్మణేతరులకుఁ గడుపుమంట పుట్టించునట్లు సర్కారు నౌకరీలలో నూటికి 90 మంది బాల్యవివాహములకుపుట్టిన బ్రాహ్మణులే కాదా. వీరికేమి కొఱఁతగలిగెను? తమవలె ఋత్వనంతర వివాహముల నవలంబించి సర్వవిజ్ఞానమును కోల్పోయి బ్రాహ్మణులనుగూడ తమతోపాటుగా మార్చవలయునని నీటితొట్టిలోబడి తోకతెగిన నక్కవలె యిట్టిబలాత్కారశాసనమును జొరపెట్టుటకు సంఘసంస్కర్తలు సాగించిరి కాబోలు!

ఇంతయేల? రుష్యాజపాన్ యుద్ధములో జయించిన వీరులందఱు బాల్యవివాహములకుఁ బుట్టినవారే కదా!

Their achievements "were obtained by her sons born and brought up under these old institutions." C. C. Mitra.

వారుగడించిన విజయము పూర్వాచారపరులైన (1898 సం॥ పూర్వము బాల్యవివాహములసేసికొన్న) వారివల్లనే కదా లభించినది. (సి. సి మిత్రగారు).

బుద్ధిబలము క్షీణించలేదని సాక్ష్యమిచ్చుట కిన్నివేల యేండ్ల నుండిబాల్యవిహవాములవల్లనే పుట్టివచ్చిన బ్రాహ్మణులను "intellectual Community forming the Crain of Govt"

"ప్రభుత్వమువారికి మెదడువలెనుండు విజ్ఞానశాఖ" వారని లార్డుకర్జన్ వంటి మహాశయులచే సైతము కీర్తిగాంచుట చాలదా.

ఈ యాచారములవల్లకాదా బ్రాహ్మణుల కిప్పటికి వారిపూర్వవైభవము చెక్కుచెదరక నిలిచియున్నది. Dr. Sir w. w Hunter దొరవ్రాసిన "హిందూదేశచరిత్ర" చదువుడు :—

"The Brahmins of the present day are the result of nearly 3,000 years of heriditary education and self restrait and they have evolved a type of man kind quite distinct from the surrounding population. Even the passing traveller in India marks them out.

Sir W. W. Hunter's" Histosy of India."

"ఈనాటి బ్రాహ్మణులు 3000 యేండ్లనుండియు పారంపర్యానుగతములగు విద్యానియమసంపదలకు పుట్టిన సాఫల్యవిగ్రహములు. దానంజేసి తమచుట్టు నావరించికొన్న జాతులన్నిటిలో విలక్షణమగు జాతిని నిర్మించుకొనగలిగిరి. మార్గమున బోవు యేబాటసారియైనను బ్రాహ్మణుని ప్రత్యేకించి గుర్తింపగలఁడు."

పాశ్చాత్యవ్యామోహమునకు లొంగక నిలువగలిగినందుననె బ్రాహ్మణులింతదశకురాగలిగిరని "Sherring" దొర వ్రాయుచున్నాడు:-

"The true Brahmin, *un-contaminated by any European influence and manners,'* with his intense self-conciousness, with the proud conviction of superiority defected in every muscle of his face, in every movement of his body is a wonderful specimen of humanity walking on God's earth."

"Castes and Tribes."

"నిజమైన బ్రాహ్మణుం డిప్పటికిని ఐరోపాదేశీయాచార సంచారములచే మురికిజెందక తీక్ష్ణమైన స్వాత్మజ్ఞానమును స్వాత్మగౌరవమును స్వాత్మనిశ్చయమును తనముఖారవిందముయొక్క ప్రతినాళమునందును ప్రకటించుచు ప్రత్యంగసంచలనమునందు నిరూపించుచు నీపరమేశ్వర నిర్మితమగు భూమిపై నడుగుపెట్టు ప్రతిమానవజాతిలో నుత్కృష్టమై యాశ్చర్యజనకమైన జాతిగా విలసిల్లుచున్నాడు."

చదువరులారా! చూచితిరా "ఐరోపాదేశీయాచారసంచారములచే మురికిపడకుండ నిజమైన బ్రాహ్మణు లిట్లుండుటకు బాల్యవివాహము లడ్డుపడగలిగెనా? వారికేమి క్షీణదశను తెచ్చెను?

## (2) దేహబలము.

ఇంక దేహబల మాలోచింతము—దేహబలము ద్విజులకన్న తక్కున జాతులలో మెండుగకలదని కొందఱకు పిచ్చితలంపు. క్షత్రియులకంటె బలవంతులెవరు? ఆనాటి క్షత్రియుల కేమికొదువకల్గెను? శ్రీరామచంద్రుడుఁ బాల్యమునందు సీతనుపెండ్లాడియేమి నష్టపడెను?- కొన్ని మొరటుజాతులలో నిప్పటికింగూడి బాహు బలమెంతో యధికముగ గన్పట్టుచున్నచోట బాల్యవివాహము వారికేమి నిర్బంధకరమయ్యెను? దేహబలక్షీణతకు బాల్యవివాహములు కారణములు కావని యీక్రింది వాక్యము సాక్ష్యమిచ్చుచున్నది.

"There even exists in many countries the custom of betrothing children before or immediately after birth as in Australia new Gunia, new Zealand etc. Among Eskimos, as soon as a

girl is born, the young lad who wishes her for his wife goes to her father and groffers himself." "Sex Lore."

ఆస్ట్రేలియా న్యూజీలండు న్యూగినియాదేశములలోను ఇంక నితర దేశములలోను పిల్ల పుట్టినవెంటనేగాని పుట్టకముందేగాని పెండ్లి జరుపబడుచున్నది. ఎస్కిమో జాతివారిలో యాడుపిల్ల పుట్టగనే పిల్లవాడు వచ్చి తండ్రితో నొడంబడిక గావించుకొని పెండ్లి సేసికొనును."

ఈజాతులు బాహుబలమునందు ప్రసిద్ధికెక్కియున్నవి. వీరికేమి కొంతగలిగెను? అదియునుంగాక నన్నిజాతులకును పశుబలము శ్లాఘనీయము కాకపోవుటయేగాక పరస్పరమారణకారణారణసాధన మగుచున్నది గదా! బుద్ధిబలము గణనీయము. అయ్యది బాల్యవివాహము లవలంబించు జాతిలోననే మెండుగ కన్పించుచున్నది. ఇంక నేమి సందేహము? బాల్యవివాహ మవలంబించుజాతులలో కూడ దేహబలము బుద్ధిబలముంగూడ నితర రజోదర్శనానంతరవివాహము చేయుజాతులందుకంటె మిక్కిలి యెక్కువగ కలదు.

ఇంతయేల? మనపాలకులు స్వదేశమునందనగా యింగ్లాండు నందు సైతము 16 వ శతాబ్దమువఱకు బాల్యవివాహములు, శిశువివాహములుకూడ నములులోనున్నట్లు తెలియవచ్చుచున్నది. 16 వ శతాబ్దములో జను లెక్కువ బలవంతులయియుండిరో 20 శతాబ్దములో నీనాటికంతకంటె యెక్కువబలవంతులుగానుండిరోతక్కువగానుండిరో తెలుసుకొనందలచి "Royal Commission on Physical Deterioration of England" అను విచారణసంఘమును నెలకొల్పి వివిధవిషయములు పర్యాలోచనగావింపబడినవి. ఆసంఘము వారుపంపినని వేదికను మాచదువరులు జూడగలిగినచో నింక నిట్టి సంఘవిప్లవకరములగు చట్టములను స్వస్థానావస్థలోసైతముం దలపెట్టరని నాదృఢనిశ్చయము. ఒక ఆంగ్లేయు డెట్లువ్రాయుచున్నాడో మాచదువరులకు తెలియపరచెదను:-

One of the evils of early marriages is said to be the deterioration of the race. But were the English less brave and was like in the 16th century than they are now. Mr. J. Furnivall, a great English authority, has discovered that we have only to look back three centuries to find the practise of child marriage flourishing in England * * * not only child, but infant marriages were in

vogue in England * * *. Is England better off with her late marriages now ? * * * not only this, the question has been seriously raised whether the marriage as it now obtains in Europe is a failure or not."
"Letter to Mrs. Besant."

"అతిబాల్యవివాహములవల్ల సంభవించుఅనర్థములలో జాతిక్షీణత నొకదానినిగా చాటుచున్నారు. కాని 16 వ శతాబ్దములోనున్న యింగ్లీషువారికంటె యీనాటి యింగ్లీషువారు యెక్కువ ధైర్యసాహససంపన్నులై యున్నారా?

ఆంగ్లేయ ప్రామాణికుడగు Mr. ఫర్నివలు దొరగారు మూడు శతాబ్దములక్రిందట మన యింగ్లండులో బాల్యవివాహము లున్నట్లు నిర్ణయించియున్నాడు. బాల్యవివాహములే కాదు శిశువివాహములు గూడ నింగ్లండులో కలవు. ఇప్పటి కాలాతీత వివాహములచేత మన యింగ్లండు రవంతయేని బాగుపడంగలిగెనా? ఇంతియేకాక ప్రస్తుతవివాహవిధానము యూరోపుఖండమునందు ఫలించెనాలేదా యను విషయము వాస్తవముగ నొక గొప్పసమస్య కవకాశమగుచున్నది."
"ఆంగ్లవాసి" (బిసెంటుగారి కంపినలేఖ)

బాల్యవివాహములవల్ల దేశక్షీణత రాజాలదని ఈ దొరగారి యభిప్రాయమే చాటుచున్నది. యూరపులోనైతము ఋత్వానంతర వివాహములను యీ 4 శతాబ్దములనుంచి యనుభవించి తలకుబట్టి యిప్పటికి తిరిగి రజోదర్శనపూర్వ వివాహములకుఁ దిగబోవుచుండ నట్టి వారిని గనుగొని బుద్ధిదెచ్చుకొనుటకు మాఱుగా మనమందరమును జూచి జూచి యఘాతములో దూకందగునా?

"Though the legal act of marriage in England until recently was 12 years for girls and 14 for boys, as a result of Education, and the growth of athleticism and the gradual change of public opinion, the tendency has been to advance the age so far, that now scientists are arguing to go back."
Rev. J. T. Davis writes thus.

రివరెండు జె. టి. డేవిసుగా రిట్లు వ్రాయుచున్నారు:-

ఇంగ్లాండుదేశమునం దిటీవలవరకును శాసనవిహితమగు వివాహవయస్సు బాలికలకు 12 సం॥ బాలురకు 14 సం॥రములు. కాని విద్యావృద్ధి వ్యాయామపోషణతో ప్రజలయభిప్రాయములు మార్పుచెందుటచే నావయోనిర్ణయములను చాల వరకు ముందుకు గుంజిరేకాని యిప్పుడు శాస్త్రివేత్తలు తిరిగి వెనుకకు పోవలయునని తర్కించుచున్నారు."

నాగరికతయందు వెనుకబడి మనలవెనుక నెన్నోశతాబ్దములకు నిదురమేలుకొన్న జాతులు తప్పుదారినబడి నేడు నేడు కళ్లుతెరుచుచున్నవి. ఇట్లే పొరపడి వారిప్పుడు దిద్దుకొనబోవుచున్నట్లు మనలకుంగూడ నిట్టిదిద్దుబాటెన్నివేల యేండ్లక్రిందటనో జరిగినది. రజస్వలానంతరవివాహములోని సాధకబాధకములు మహర్షులచే పరిశీలింపబడి యగ్రజాతులకవి నిషేధింపబడినవి. తిరిగిపాతిపెట్టినవాటిని పెల్లగించిన ఫలమేమి? ఎదుటవారిం జూచి వారుపడు దురవస్థలం జూచి (సంఘశుద్ధియను ప్రకరణముజూడుడు) జూచి మనము తప్పుదారిలోబడనేల?

"In the course of Evolution of the Hindu idea of marriage the kind favoured by the West founded by mutual attraction was given a trial. It was found wanting and discarded. Is. it possible, that we too shall at some future time discard it?

"హిందువులలోని వివాహపరిణామదశలలో మనమిప్పుడు మన పాశ్చాత్యదేశమునందు పరస్పరానురాగములమీద నాధారపర్చుకొన్న వివాహపద్ధతు లవలంబింపబడి యనర్థకరములని త్రోసివేయబడినవి. మనముగూడ నింకముం దేనాటికైనను త్రోసివేయుటకు వీలుకలుగునా?" అని రివరెండు జె. టి. డేవిసుదొర వ్రాయుచున్నాడు.

చదువరులారా! ఈ పైవ్రాతలవల్ల రజస్వలానంతరవివాహము లెంత రుచికరములుగా మన పాశ్చాత్యసోదరులచే నభినుతింపబడుచుండెనో తెలిసినదిగదా! ఇట్టి సంఘశుద్ధివినాశకము లగు బలాత్కారవివాహశాసనములు మనలకుంగూడ కొంతకాలమునకు దుఃఖహేతువులై సంఘవిధ్వంసము గావించవా? జాగ్రత్త. ఈ క్రింద మేము వ్రాయఁబోవు "సంఘశుద్ధి" సారాంశములు చదివినచో ముట్టివివాహములలోని యనర్థములు మరింత చక్కగ విశదముకాగలవు. బ్రహ్మచర్యము గురుకులవాసము ఎఱుంగని ప్రస్తుత విద్యావిధానములు, మద్యమాంసాహారములు, తప్పత్రాగుడులు, సంఘదురాచారములు, పోకిరినాటకములు, మైదుకప్పునవలలు క్రొత్తదారులనేర్పుసినిమాలు, నాగరవాసములు దేశక్షీణతకు కారణములని నిరాఘాటముగా చాటఁగలను. బాల్యవివాహములేనాటికిం గారణములు కానే కానేరవు.

## సంఘశుద్ధి

అతిబాల్యవివాహములు సంఘశుద్ధిని చెడగొట్టుననియు రజస్వలానంతరవివాహములు సాంఘికపరిశుద్ధికి కారణభూతములనియు సంస్కర్తల ద్వితీయఘోష. ఇట్టిపరిశుద్ధికి కారణమేమన కన్య యుక్తవయస్సుకలదైనచో తగువరుని తానే నిర్ణయించుకొని పెండ్లాడునని దానివల్ల సంఘము పరిశుభ్రముగా నుండునని ఒకసిద్ధాంతము.

### (1) స్వయంవరణము

ఇట్టివివాహములు మనదేశంబున లేకున్న పాశ్చాత్యదేశములందు విచ్చలవిడిగా జరిగించబడుచున్నవి. ఇందువల్ల తత్ఖండవాసులేమి బాపుకొనంగలిగిరో విచారింతము.

రజస్వలానంతర వివాహములిచట కొన్నితెగలలో పరీక్షింపబడినవనియు, యందున్న యనర్థకముల గుర్తెఱింగి పిమ్మట వాటిని ద్రోసిపుచ్చిరనియు ప్రథమప్రకరణములో నిరూపించితిని. అట్టి యనర్థము లెవ్వియో తెలియపరచుచు నొకసంస్కర్త ఇట్లు వ్రాసెను.

As her marriage was contingent on her selection, it was not unlikely that failing to make a selection, she remained unmarried. But a spinster was not a desirable member of the family not only on economic but also on moral grounds for she stood the risk of going astray. Probably it was from considerations like these that parents and brothers gradually became anxious to see a girl married before she could exercise her own judgement, which probably ultimately led to the custom of infant marriage." Marriage, Page 250.

Rig Vedik culture by A. C. Das.

"బాలికావివాహము కన్య తానే భర్తను కోరుకొనుటపై నాధారపడియున్నందువల్ల, బహుశా (పిల్ల తానుతలిదండ్రులను వదలలేకపోవుటచేనేమి, తలిదండ్రులు కుమార్తెను విడిచియుండలేకపోవుటచేతనేమి) యేకారణమువల్లనో కన్య వరుని గోరికొనకుండనే యింటనుండుట ప్రాయికమైయుండెను. కుటుంబములందు నవివాహితలైన స్త్రీలుండుట ధనవ్రయవిషయములోనేగాక నీతిపథమునకుంగూడ దూరమగుటంజేసి వారు అసహ్యకరములుగ నెన్నంబడుచు వచ్చిరి. ఏలయనగా (యీడేరినకన్య లెండ్లతరబడి తండ్రివద్దనేయున్నచో) వారు చెడుమార్గములుపట్టి

నడుచుట కెంతో యవకాశముగలదు. బహుశా యిట్టివిషయములన్నియు గమనించి యేకాబోలు, కన్యక తాను భర్తను నిశ్చయించుకొనజాలకముందే పెండిలిసేయ వలయునను తొందర తలిదండ్రులకును సోదరులకును కలుగుట తటస్థించి కాలక్రమముగ నదియే బాల్యవివాహములక్రిందికి దిగినట్లు తోచుచున్నది.''

దాసుగారుచేసిన యూహాలో సత్యమెంతయున్నను, స్వయంవరణములందేమి ఋతునంతర వివాహములందేమి స్వాభావికముగ నిట్టి యనర్థములు కలవను నమ్మకము వారికుండుట నాకెంతో సంతోషము. వీరియూహ నిజమేయైనచో వ్యక్తవివాహములు (Post Puberty marriages) పూర్వకాలముననందే పరీక్షింపబడి యనర్థదాయకములై సంఘ విప్లవకారకములగునేమోయని విసర్జింపబడినట్లు వారియొప్పుదల మీదనే తేలుచుండ వీరేల పూర్వాపరసందర్భముల మరచి 259 పుటలో

"She was allowed no choice in the selection of her husband and she was married at an age when she was incapable of understanding the real significance of marriage and exercising her own Judgment and discretion and womanhood was sacrificed at the altar of supposed social convenience."

(Page 259 Married life.)

"భర్తను గోరుకొనుటలో నామెకేమియు నధికారము నివ్వనందునను, పెండిలియననేమో తెలిసికొనజాలని వయస్సులో వివాహమొనర్చబడి, యామెయిష్టము లేనిదే, యామె కోరుకొననిదే యెవరికో యివ్వబడును. స్త్రీత్వమిట్లే సాంఘికానుకూలతకు బలి యివ్వబడినది".

వారిట్లు వాపోవుట కేమిహేతువో తెలియరాకున్నది. ఇట్టి సంఘసంస్కర్తలే మనస్మృతులు పరిష్కరించుటకు కలికాలమహర్షులై శాసనసభలందవతరించియున్నారు.

ఆంగ్లేయవిద్య నాల్గుముక్కలు నేర్చి నవనాగరికుల మైతిమని భావించుకొందురేగాని స్త్రీలాలోచించుటకు మొదలిడిన కార్యభంగము కాగలదని పెద్దలు చెప్పు మాటలను వినకూడదా. ఆంగ్లకవి "Addison"

"A woman that deliberates is lost"

"ఆలోచనకు మొదలిడిన యాడుది యడుగంటిపోవలసినదే"

యని చెప్పుచున్నాడు.

పైనకనుపరచిన "దాసుగారియూహలు మన దేశములో యా

నాటికి జరిగనేమోగాని నేటికి స్వయంవరణాధికార మాడుదాని కిచ్చుటచే పాశ్చాత్యదేశములు మాత్రము తద్గతికి వచ్చినవి."

"A million of grown up women remain unmarried and unprotected in England."

"ఇంగ్లండులో పదిలక్షలమంది స్త్రీలు పెండ్లిసేసికొనకుండ, దిక్కులేనివారై యున్నారు."

ఇంతకంటె నింక ఘోరమగు దుస్థితిని జూపెదను:—

"There are at least 50,000 girls in New York, living with men who are not their husbands, girls who should have become mothers but don't care to have children.

"Judge Lindsey."

న్యూయార్కుపట్టణములో నిప్పుడు పెండిలికాకుండ భర్తలుకానివారలతో విహరించు స్త్రీలు 50,000 మందికలరు. వీరు పిల్లతల్లులు కావలసినవారేగాని వారికి సంతాన మక్కరలేదు. (జడ్జి లింజ్సేగారి గ్రంథము.)

తమ దేశమందింత వచ్చిని దాచిపెట్టుకొని మాయదొరసాని (Miss Mayo) హిందువుల నెట్లాక్షేపించగలిగెనో. గురిగింజ కేమెఱుక

ఇంగ్లండు, అమెరికా, లిట్లుండ నిక ఫ్రాన్సుపసు యవస్థచూడుడు. స్త్రీలు పెండ్లిసేసికొనక గర్భస్రావముల సేసికొనుచుండుటచే దేశమునందు జనసంఖ్యతగ్గి రోగములుహెచ్చి ఫ్రాన్సు చెడిపోవుచుండుటచే గాబోలు.

The French politicians to-day are practising busy schemes of

(1) Inducing people there to marry to be-get by
 (*a*) Exemption of tax.
 (*b*) Increase of pay to fathers of children.
 (*c*) Imposition of taxes on others.
 (*d*) Grant of bonus to mothers during confinement and after "confinement."

"*Rationale of early marriage*" *P.* 44 *and* 45.

ఫ్రెంచిదేశనాయకులు నేడు గొప్పయాతురతతో కొండలంత పన్నాగముల వేసి ప్రజలందఱు పెండ్లిండ్లుసేసికొని బిడ్డలు కనుటకు తగుప్రోత్సాహ మివ్వ నిశ్చయించి, పెండ్లిచేసుకొని బిడ్డలగన్నవారికి.

(౧) పన్నులు రద్దుసేయుట

(౨) జీతములు వృద్ధిసేయుట (తండ్రులకు)

(3) పెండ్లి సేసుకొనకున్న వారిమీద సుంకములు విధించుట
(४) కడుపుతోనున్న తల్లులకు ధనమెసంగుట

మొదలగు రాచకీయచర్యలు జరుపుచున్నారు.

మనదేశముకూడ నింకమీద నిట్టిదుర్గతికే రావలసియున్నది కాబోలు. శాంతంపాపం. పాపము శమించుగాక.

అమెరికాలో న్యాయాధిపతియై 25 సం॥ (Juvenile Court) బాలశాసనశాలలో పనిచేసి "Rovoltof Youth" గ్రంథము వ్రాసిన మహానుభావుడేమి వ్రాయుచున్నాడో చదువుడు,

"Out of 439 girls of High School age who admitted to me that they had sex experiences with boys, only 25 became pregnant. This is about 5%, a ratio of 1 in 20. The others avoided pregnancy, some by luck, others * * * * by contraceptive methods * * Hundreds of instances resort to abortionists. I don't guess this. I know it.

During 1920—1921, the Juvenile courts of Deniver dealt with 769 delenquient girls of high school age. * * * At least 2,000 cases were directly involved ln the case of these 769 girls" * * Even the minimum figures are shocking."

హైస్కూళ్లలోనున్న 493 కన్యలు తాము సంభోగసుఖ మనుభవించిన మాటనిజమని నాయెదుటనే యొప్పుకొనిరి. కాని వీరిలో 25 మాత్రమే గర్భవతులైరి. ఇది 570 అనగా 20 లో 1 చొప్పున—మిగిలిన వారందరు (468 మందియు) గర్భము రాకుండ తప్పించుకొనిరి. కొందఱు తమ ప్రాప్తమువల్లను, కొందఱు గనిర్భనివారకభోగ సాధనములచేతను, ఇంకమిగతావారలు నూర్లకొలంది డాక్టర్లవద్ద కేగి గర్భస్రావము గావించుకొనిరి. ఇది నేనూహించి వ్రాయుట కాదు. ప్రత్యక్షముగ నెఱుంగుదును.

1920—21 సం॥ డెన్వరు (పిల్లలశిక్ష) జూవినైయల్ కోర్టులలో, హైస్కూలువయసుగల 769 కన్యలమీద చెడునడత నేరములుమోపబడినవి. ఈ 760 కన్యలమీద పెట్టబడిన కేసులు 2000 తక్కువలేక కలవు. (అనగా పిల్లకు 2-కి—3 కేసులు) ఈ కనీసపు లెక్కలతోనే గుండె పగులుచున్నది."

పాపము మన "Mother India" వ్రాసిన మాయదొరసాని (Miss Mayo) యిటీవల తనయమెరికాలోనే ప్రచురింపబడిన Revolt

(రిపోర్టు ఆఫ్‌యూతు=బాలదార్జన్యము'') ను చదువుకొని సిగ్గువడుట కుమారుగ మనల నేటికాక్షేపించినదో—ఈమె వ్రాసిన గ్రంథము చదివిన ప్రతివానికి నెత్తురు తుకతుకలాడకమానదు.

కన్యలకువివాహంములుసేయకరజస్వలానంతరమూరకయుంచిన యెడలసాంఘికశుద్ధియెంతభగ్నంపాడుగానున్నదోనిరూపించితిని.

బాల్యవివాహము లే సంఘశుద్ధి నొసంగునో, వ్యక్తవివాహము లే సంఘశుద్ధినిచ్చునోయూహించుడు. ఇంతవఱకుస్వయంవరణాధికారము ననుసరించి వ్రాసితిని. పిన్‌కాటుదొర (Fredrick Pincott) వ్రాసిన యభిప్రాయమును బ్రకటించినంగాని యీవిషయమును ముగించెదను.

"Of course, the advantage (in early marriages) is purchased by the children's choice. But is self choice an advantage at all?

The absence of self choice in India obviates the fluttering uncertainty under which our English girls live in. It imparts to marriage a sense of destiny which has beneficial effect in after life."

"బాల్యవివాహములలోగల లాభములు వధూవరుల స్వయంవరణాధికారము తెగనమ్మి గడించబడినవి. కాని యింతకును స్వయంవరణాధికారమే మైన సత్ఫలకారి యయ్యెనా?

ఇండియాలో స్వయంవరణము లేకుండుటచే మన యింగ్లీషు కన్నెలు భర్తకొఱకు తాముపడు దోలాందోళనచే నిలుకడలేక గింజుకొను యవస్థభారతీయ బాలికలకు తప్పినది. వివాహము ప్రాక్తన కర్మఫలప్రాప్తమేయను బుద్ధిపుట్టించి (యీజన్మకిదే శివరాత్రియన్నట్లు) జీవయాత్రకు చక్కని సౌకర్యము నొసంగుచున్నది.

(2) వ్యక్తవయస్సు.

ఇట్లుండ కన్యలు వ్యక్తలైనంగాని (అనగా రజస్వలలైనంగాని) వారికి విచక్షణజ్ఞానము లభించదనియు, తత్పూర్వదశలో వారవ్యక్తలై మంచిచెడుగుల వివేకింపఁ జాలకపోదురనియు సంఘసంస్కర్తల పిచ్చియూహ. దీనికేమియుం బ్రమాణములు లేనే లేవు. కన్నెలకు రజస్వలకాగానే విజ్ఞానమంతయు కరడుగట్టి వారల తలపుట్టెల

లోని కవతరించినదని సంస్కర్తలగువారి యభిప్రాయము కాబోలు. ఎన్నటికైనను గాని కన్నె తాను గోరుకొనువరునియందుఁ జూచుకొను విషయము చక్కఁదనము మాత్రమే సుమీ. ఇట్లే మెఱసెడిదంతయు బంగారమే యనిభ్రమపడి పాశ్చాత్యకన్యక లడ్డగోలుగా భర్తలంగోరుకొని తరువాత కొలదిరోజులకే వారు మోహై రుచించక "విడుదల" కై (Divorce) కోర్టువారి యెదుట నర్జీలు దాఖలుచేసుకొని గింజులాడుకొనుచున్నారు. ఇదియే వ్యక్తకన్యా వివాహలక్షణము కాబోలు. ఇట్టిదురాగతములు సంభవించుననియే గదా వరుని గోరుకొనుపని కన్యకీయగూడదని మనవారు నిశ్చయించిరి. మనవారియందే గాదు. ఇతర దేశములలోగూడ నిదియే ప్రక్రియ జరుగుచువచ్చెను.

The ancient Hebrew not only could he dispose of his daughters but he could also choose wives for his sons. Among Roman in earliest times the father could give wife to his son or give his daughters in marriage. A Greek woman could be given in marriage by her father to man she did not know at all. * * In Japan and many other places, the marriage is nearly always arranged by the father."

"Sex Lore" by Herbert.

"(In 16th century) As in India, so in England, it was the parents who selected the bride or the bridegroom and the son or daughter was bound to abide by the decision of their guardians."

"Sex Lore" by Herbert.

"హీబ్రూలలో పూర్వులు తమకొమార్తెలను తమయిష్టమువచ్చిన వారికిచ్చి పెండ్లి సేయుటయే గాక తమకొడుకులకు గావలసిన భార్యలను గూడ తామే కుదుర్చుచుండురు. రోమనులలో పూర్వకాలమందు కోడండ్రను, అల్లండ్రను గోరుకొనుపని తండ్రియే చేయుచుండెడి వాడుకకలదు. గ్రీకుకన్నెకు తనతండ్రి తనవెవరికిచ్చి పెండ్లిచేసినదియును తెలియకుండనే వివాహము జరుపబడుచుండెను. ఇంకను జపాను మొదలగుదేశములలో పెండ్లిమనువులు కుదుర్చుపని తండ్రికే కలిగియుండెను.

(16 వ శతాబ్దములో) ఇండియాలో జరుగుచున్న మాదిరిగానే ఇంగ్లండులోగూడ వధూవరుల మనువులు కుదుర్చుపని తలిదండ్రులకే గలదు. బాలురు బాలికలుకూడ తలిదండ్రులు కుదిర్చిన మనువునకు బద్ధులై యుండిరి.

ఇంక నేమి యద్భుతము కావలయును? మనదేశమునందు
రకు "విడుదలలు" లేనే లేవని చెప్పవచ్చును. గాని శాసనసభలో
orce Bill" (భార్యాభర్తల విడుదలచట్టము) మన శాసనసభా
ష్టులు కొలదిరోజులక్రిందటనే యవతరింపఁజేసిరి. ఇఁకమీఁద మన
ములో "Divorce Courts" (విడుదలకోర్టులు) వృద్ధిజెంది యున్నచో
ట్లకు యెన్నోరెట్లుగల మన భరతభూమియందు కోట్లకొలంది వి
కేసులఫైల్ జాస్తి గావింపబడవలసినదేనా?

శాంతం పాపం. పాపము శాంతించుగాక.

ఈవిషయ మింతటితో ముగించి వ్యక్తవయస్సు యేదో విచా
దను. మనశాస్త్రములందున్న సిద్ధాంతము లటుండనిచ్చి కొందఱు
రులకు వేదతుల్యంబు లగు పాశ్చాత్యవేత్తల సిద్ధాంతము లుగ్గ
ంచున్నాడను.

(Herbert Spencer) హెర్బర్టుస్పెంసరు సృష్టిలోని పరిణామ
ముల పరీక్షించుచు, జీవునకు మానవశరీర మొకటి లభించిన
ట నభివృద్ధిసెందుటకొఱకు దేహము పెరుగ నక్కర లేదనియు,
స్స విజ్ఞానము అభివృద్ధిని జెందవలయుననియు ప్రకటించెను.
క పెద్దశరీరము కలిగిననేగాని బుద్ధి పెద్దదికాజాలదని స్థూలదృష్టి
జనులు కొందఱు తలంచుట గొప్ప యవివేకము.

s Herbert Spencer originally pointed out the further possibi-
of evolution are psychical and moral rather than physical."

"Rationale of early marriage" P. M.

The female intellect will yield, under special discipline,
ucts higher than the intellects of most men can yield."

(Herbert Spencer.)

హెర్బర్టుస్పెన్సరు దొర ప్రథమములో చెప్పినరీతిగా జీవులకు తదనంతర
మదశలు మారుచుండుటకు శరీరసంబంధముతోగాక బుద్ధి వివేకాభివృద్ధితో
ంధము కలిగియున్నది.

తగు కట్టుబాటులతో పెంచబడినచో స్త్రీలబుద్ధి సాధారణ
పబుద్ధి యిచ్చు ఫలితములకంటె యెన్నోరెట్లెక్కువగ ఫలితము
కలిగియుండును. ("హెర్బర్టుస్పెన్సర్")

ఇంక నేమి యద్భుతము కావలయును? మనదేశమునందు నేటివరకు "విడుదలలు" లేనేలేవని చెప్పవచ్చును. గాని శాసనసభలో "Divorce Bill" (భార్యాభర్తల విడుదలచట్టము) మన శాసనసభా మహర్షులు కొలదిరోజులక్రిందటనే యవతరింపఁజేసిరి. ఇంకమీాద మన దేశములో "Divorce Courts" (విడుదలకోర్టులు) వృద్ధిజెందియున్నై ౨౦౦ స్టేట్లకు మెన్నోరెట్లుగల మన భరతభూమియందు కోట్లకొలంది విడుదలకేసులఫైల్ జాస్తి గావింపబడవలసినదేనా?

శాంతం పాపం. పాపము శాంతించుగాక.

ఈవిషయ మింతటితో ముగించి వ్యక్తవయస్సు యేదో విచారించెదను. మనశాస్త్రములందున్న సిద్ధాంతము లటుండనిచ్చి కొందఱు సోదరులకు వేదతుల్యంబు లగు పాశ్చాత్యవేత్తల సిద్ధాంతము లుగ్గడించుచున్నాడను.

(Herbert Spencer) హెర్బర్టుస్పెన్సరు సృష్టిలోని పరిణామ క్రమముల పరీక్షించుచు, జీవునకు మానవశరీర మొకటి లభించిన పిమ్మట నభివృద్ధినొందుటకొఱకు దేహము పెరుగ నక్కఱ లేదనియు, మనస్సు విజ్ఞానము అభివృద్ధిని జెందవలయుననియు ప్రకటించెను. కనుక పెద్దశరీరము కలిగిననేగాని బుద్ధి పెద్దదికాజాలదని స్థూలదృష్టితో జనులు కొందఱు తలంచుట గొప్ప యవివేకము.

As Herbert Spencer originally pointed out the further possibilities of evolution are psychical and moral rather than physical."

"Rationale of early marriage" P. M.

The female intellect will yield, under special discipline, products higher than the intellects of most men can yield."

(Herbert Spencer.)

హెర్బర్టుస్పెన్సరు దొర ప్రథమములో చెప్పినరీతిగా జీవులకు తదనంతర పరిణామదశలు మారుచుండుటకు శరీరసంబంధముతోగాక బుద్ధి వివేకాభివృద్ధితో సంబంధము కలిగియున్నది.

తగు కట్టుబాటులతో పెంచబడినచో స్త్రీలబుద్ధి సాధారణ పురుషబుద్ధి యిచ్చు ఫలితములకంటె మెన్నోరెట్లెక్కువగ ఫలితము లివ్వగలిగియుండును. ("హెర్బర్టుస్పెన్సర్")

కావున స్త్రీజాతికి పురుషులకంటె విజ్ఞానమున కవకాశములు మెండుగా గలవు. ఆడుపిల్లకు 8 యేండ్లవయస్సు వచ్చినప్పటికిని యే విధమైన జ్ఞానములేని తొట్టిలో బాలవంటిదే యని తలంచుట తప్పు. మనయిండ్లలో యెంతమంది కన్యలు వివాహకాలమందు తమభర్త యెఱ్ఱనివాడుకాడనియు, చక్కనివాడుకాడనియు, గునుపు చూపించుటలేదు. ఎందరేడ్చి మారాము పెట్టుటలేదు. వీరికి జ్ఞానమే లేకున్న నిట్లేడ్చెదరా! కన్య సమిష్టికుటుంబములలోపుట్టి చక్కని కట్టుబాట్లతో పెరిగినచో భర్తయన్న నేమో తెలియుటకు రజస్వలకాలము వరకు కావలెననుకొనుట మన యవ్యక్తతను చాటునుగాని వేరొండుగాదు. అట్టికన్య 8 యేండ్లనాటివివేకముకంటె వ్యక్తురాలైనపిమ్మట మరింత వ్యక్తురాలగు ననుకొనుట పొరపాటు. ప్రస్తుత సంఘమర్యాదలకు లోబడి మరింత యవ్యక్తురా లగునేమో యని మాభయము. కన్యలకు 8 యేండ్లకు యితరుల జూచి నేర్చుకొనగల వివేక ముదయించ గలదను నిర్ణయము మనముగాని మనమహర్షులుగాని గనిపెట్టిన కవిత్వమని సంఘసంస్కారులు నవ్వెదరుకాని పాశ్చాత్యశాస్త్రవేత్తలు సైతమిట్లే తలంచుచున్నారు:—

"Life is said to be divisible into seven—year—periods. Huxley points out that the whole material of the body is renewed in this period. Generally conciousness begins to build the individual world in the beginning of the second period."

(Ibid) page 20.

"జీవితమునంతయు యేడేడుసంవత్సరము లొక్కొక్కదశగా విభజింపవచ్చును. హక్స్లీదొరగారు చెప్పినట్లు ఇట్టిదశలో దేహసామగ్రియంతయు మాఱి క్రొత్తగా యేర్పడుచుండును. సాధారణముగ మనుష్యునకు తనప్రపంచకజ్ఞానాంకురములు రెండవదశాప్రారంభమందే జనించును." (పేజీ—20)

అనగా 8 యేండ్లు వచ్చునప్పటికే తనచుట్టు నావరించుకొన్న లోకములం జూచి, పెండ్లిండ్లు పేరంటములంజూచి తనతలిదండ్రులను బావలక్కలను జూచి తోటిపిల్లల పెండ్లిపద్ధతులజూచి తనకుగూడ ముందుముందు కాదగిన సాంసారికవిభూతిని గుఱ్ఱెఱింగి యువ్విళ్లూరుచు తామగూడ బొమ్మలకు పెండ్లిండ్లుచేయుచు నవ్వులాటలకు భోజనాదు

లారగించుచు నీవిధముగా భర్తయన్న నేమో తెలుసుకొనుటకు యెనిమిదవ యేడుగూడ చాలదా? చాలదే యనుకొనుము; కన్యతాను వ్యక్తరాలై స్వయముగా కోరుకొనబోవు భర్తలో నేమేమి సద్గుణ సంపత్తిని బాగుగా గుర్తింపగలిగి యున్నది? బయటి కగుపడు చక్కదనమొక్కటి యేగదా. మిగిలిన యనురాగదాంపత్యానుకూలతలు గుర్తెఱుంగవలయునన్న ("wooing") సమీపపరీక్ష గావించి యనురాగ మెఱుంగునట్టి మానసరా శృంగార పద్ధతులు కొన్ని దేశములలో వలె నిక్కడనుం గూడ ప్రవేశపెట్టుట మిక్కిలి యావశ్యకము కాదా? అట్టిపరీక్ష గావించుచు ప్రతికూలురగు వారిం ద్రోసి పుచ్చుచు యనుకూలురగువారి తారతమ్యము త్రాసునం దూచుచు "అతడు కాదే యితడు కాదే యీతడే యీతడే" యనుకొనుచు తదేకమనస్సుతో నిర్ణయింపం జాలక తటతటకొట్టుకొను యితర దేశపు కన్నెలవలెనే (fluttering uncertainty of girls) మనకన్యలు కూడ బాజారులపాలు కావలసిన దేనా? పెండ్లియన్న నేమో 8 వ యేటనే బాగుగా తెలిసినప్పు డదిచాలదా? సంభోగమన్న నేమో తెలియవలయునా? ఇది యెక్కడి వేదాంతము? అందువల్ల కన్యకు వివాహవ్యక్తత్వము వచ్చినవయస్సు యేదియని యందురేని 8 వయేడు మాత్రమే కావలయును. రజస్వలానంతరము వచ్చు వ్యక్తత్వమే సంభోగవ్యక్తత్వము. తదనంతరమే కదా గర్భాధాన మొనర్చుచున్నారు. ఇందు మనవ్యక్తతకుగాని కన్యల వ్యక్తతకుగాని రవంతయేని భంగము కనుపించదు. పైపెచ్చు సంస్కర్తల మనుకొనువారి వ్యక్తతకు మాత్రము భంగ మాపాదించుచున్నది.

మనదేశమునందు గల సమిష్టికుటుంబపద్ధతులే యింతవరకు మన సంఘమును దుర్దశలపాలుగాకుండ కాపాడినవి. ఈ యభిప్రాయమును చాలమంది పాశ్చాత్యవిద్వాంసులు కూడ ప్రకటించియున్నారు.

An early marriage ceremony cannot be stopped without destroying parental control. In England we are prepared to think it a shocking thing that parents would give their children in marriage to whomsoever they please. Our feelings are due to our own habits and nothing more, for, opinion on all social matters is due to education and association. In India, the parental

choice is regarded as necessary and as a grave responsibility a father will hamper his future life with pecuniary liabilities in order to secure a suitable husband for his daughter. This is sufficient to prove that marriage is not in India, the frivolous thing it has been in the west. By the Hindu system every girl has a natural guardian, who is solemnly bound to see her properly married at any expenditure of trouble and money. * *

(By early marriages). A boy and a girl in India grow up to the knowledge that they are distined for each other, they know that their lives have to be passed together and from the earliest years they learn to adapt themselves to their future condition. It is universally admitted that compromise and concession from the solid basis of matrimonial happiness and the sense of destiny imparted by early marriages powerfully promotes a spirit of compromise.

*Frederick Pincott.*

"మాతాపితరులకు పిల్లలపైగల యధికారమును నిర్మూలింపనిచో బాల్యవివాహములడుగంటింపజాలము. తలితండ్రులు తమయిచ్చవచ్చినవారికిచ్చి పిల్లలఁబెండ్లి కావించుట యనువిషయము ఇంగ్లండులోనున్న మనకు గుండెపగిలి పోవునట్లనిపించును. మనయభిప్రాయములు మనయాచారముల మీదనే యాధారపడియున్నవి కాని వేఱొండు కానేకాదు. ఏలయనగా సంఘసందర్భములు విద్యకును సహవాసమునకును చెందియున్నవి. ఇండియాదేశములో పితరుల యధికారము కడుయావశ్యకముగా నెన్నంబడుచున్నది. తండ్రి తనభావిసంపదల నన్నింటినికూడ వెచ్చపెట్టి రాబోవు ఋణబాధల కోర్చి పిల్లకు తగినవరుని దానెంతయో వ్యయప్రయాసలకు లోనై కుదుర్చుబాధ్యతను వహించుచున్నాడుగదా. పాశ్చాత్యదేశములలోవలె వివాహమనునది యిండియాలో చిల్లరబేరమువంటి యల్లరి పనికాదు, హిందూపద్ధతులప్రకారము ప్రతికన్యకకును ధర్మశాస్త్రబద్ధమగు పోషకుఁ డొకడుండి తీరును. ఇట్టిపోషకుడెంత ధనవ్యయమును గాని సహించి పిల్లకు సక్రమముగా పెండ్లి సేయించువిధిని బూనుకొనకతప్పదు.

బాల్యవివాహములలో వధూవరులు కాలక్రమముగ వారు పెద్దవారగుకొలదియు తామొకరికొకరు పూర్వజన్మకర్మవల్ల నిర్ణయించి వ్రాయబడుటచే పెండ్లాడుకొనుట తటస్థించెనను యభిప్రాయముతోడనే వర్ధిల్లెదరు. ఇంక (వడ్లతోడనే తట్టయెండవలెనన్నట్లు) నీజన్మకు వారొకరికొకరు వ్రాయబడిరనితలంచి యిద్దఱును కలసి జీవయాత్రగడపుట యనివార్యమనియెంచి పరస్పరలోపముల సర్దుకొని యొకరిస్థితిగతుల కింకొకరు చక్కఁగ నలవాటుసేసికొనుచుందురు. కుటుంబసౌఖ్యమునకు నిట్టిసమాధానభరిత చిత్తము, లోపముల సర్దుకొనగల స్వభావము మూలస్తంభములని చెప్పవచ్చును. ఈవిషయ మందఱు అంగీకరింపక తప్పదు. కర్మ వ్రాసిపెట్టినందున నొకరికొకరకు తటస్థించితిమని భార్యాభర్తలనుకొనుటకు బాల్యవివాహ మొక

మార్గము. అట్టిసమాధానము కలుగుటకు బాల్యవివాహములు తోడ్పడు చున్నవి.
(అని ఫ్రెడరిక్కు పింకాట్టుదొర వ్రాసియున్నాడు.)

We must also understand that the Hindu marriage contract is invailable and the course of life is inevitable. The minds of the parties are in the proper frame for making the best of things. These provisions have stood the tests of centuries and by their results continue to proclaim their excellence.

*"Pincott"*

హిందూదేశీయులలో వివాహసంబంధములు మిక్కిలి యభేద్యము లగుటయే గాక, అట్టి వివాహములకు సంబంధించిన జీవిత విధానము సైతము ప్రాక్తనకర్మ ప్రాప్తమైనందున నిర్ణీతమే యనుకొనవలెను. ఇది యందఱకును సమ్మతమే. దానంజేసి వధూవరులు తమతమ మానసములను చక్కని దశలోనికి మార్చుకొని భావిజీవయాత్రా సంచారమునకుం దగుపద్ధతులమీద పరిష్కరించుకొన గలిగి సమస్త స్థితిగతులను లాభకారులుగా చేసికొనగలరు. ఈ వివాహ ధర్మములు యెన్ని వేలశతాబ్దములనుండియో పరీక్షింపబడి (సంఘువిప్లవధాకకు తాళగలిగి) తమసాఫల్యముచే బాల్యవివాహోన్నతిని జగద్విఖ్యాతము గావించుచున్నవి. (పింకాట్టుదొరగారు)

More over, in practise, child marriage has some clear advantages. For it allows the wedded pair to be brought together as children only in their parents houses till in time they become habituated to each other's company.

*"Woman of India by Otto Rothfield"*

ప్రస్తుతాచారముల ప్రకారము బాల్యవివాహములు స్పష్టముగ కొన్నివిషయములలో మిక్కిలి లాభకరములగుచున్నవి. ఏలయన తమతమ పితృగృహములనుండియే వధూవరుల హృదయములు ప్రేమపాశాకర్షితములగుచు రానురాను దగ్గరకు దగ్గరకు వచ్చి తుదకు కలసియుండుట కల్గుచున్నది.
("ఇండియాలోస్త్రీలు" అనుగ్రంథములో ఆటోరాథఫీల్డు దొర వ్రాసినది.)

కావుననే మన దేశమునందుఁ బసుపుకుంకుమలకును, మంగళసూత్రములకు నెంతో గౌరవము కలదు. ఈగౌరవమే వివాహమునకు పవిత్రత నొసంగుచున్నది. పిల్లలు కాపురమునకు వెళ్లకమునుపే తమభర్తయొక్క యాయురైశ్వర్యాభివృద్ధికై పుట్టపుట్టకు మ్రొక్కుచు చిట్టిబొట్టు నోములు గౌరీవ్రతములు నింకనేమేమో నోచవలసిన నోములన్నియు నోచి రజస్వలలై కాపురమునకు పోవుతరికి తామెంతో పావనహృదయులై భావిసంసారపట్ట

మహిమాధీలక్షణముల నంది విరాజిల్లుచున్నారు. ఇట్టినోములు వ్రతముల వల్ల గలుగుఫలములుమాసంస్కర్తలు పేలపిండిముద్దలందురు కాబోలు. సంకల్ప బలప్రభావము (the potency of will power) నెఱింగిన ప్రతి మనుష్యమాత్రు డట్లు తలంచడని నానమ్మకము. ఇట్లు వధూవరుల మానసముల రెంటిని పరస్పర సాధకబాధకముల కలవరిచి యుంచుటయే కన్యావివాహఫలితమని పాశ్చాత్యులు సైతము గుర్తెఱింగినను మన సంఘసంస్కర్తలు పట్టపగలె కండ్లుమూసుకొనిరో యన్నట్లు యితర దేశములలో జరుగుచున్న "యాకస్మికవివాహముల" నిచట స్థాపింపచూచుట సంఘద్రోహమేకదా. పాశ్చాత్యు లేమనుచున్నారో యొకమారు చదివిచూడుడు. వారినిజూచి మనము బుద్ధిదెచ్చుకొనవలసిన విషయములు చాలకలవు.

హిందూకన్యక లిట్లొనర్చు బ్రహ్మచర్యతపస్సు శ్రేష్ఠమో యితరకన్య లొనర్చు "Wooing" తపస్సు శ్రేష్ఠమో తెలిసెనా? చూచితిరా! మనపద్ధతులను స్వానుభవము వల్ల నితరులు సంస్తుతించుచుండ మనము విసుకుసెంది యితరుల పద్ధతులు మంచివనుట వెర్రితనము—ముమ్మాటికిని వెర్రితనమే—బాల్యవివాహములవల్లనే నారీమణులకు భూషణ మనందగు పాతివ్రత్య మలవడుచున్నది. బాల్యదశలోనుండియే భార్యాభర్తలు తమ మానసముల నిట్లు పరస్పర ప్రేమావకాశములకు కుదురుపరుచుకొని కాలక్రమముగ ననురాగతపస్సులొనర్చినచో నట్టి దంపతులు పెడదారి ద్రొక్కజాలరని రూఢిగా చాటగలను. బాల్యవివాహములవల్ల పాతివ్రత్యము చక్కగ కుదురగలదనుటకు పాశ్చాత్యపండితులుగూడ సాక్ష్యమిచ్చుచున్నారు:—

Mr. Lecky in his "History of European morals".

"The nearly universal practice of the custom of early marriage among the Irish peasantry has alone rendered possible that high standard of female chastity, that intense and jealous sensitiveness respecting female honor, for which among many failings and some vices, the Irish poor have long been prominent in Europe." "History of European Morals", by "Lecky."

ఐర్లండుదేశములోని కాపువారలలో సార్వజనీనముగా వ్యవహరింపబడుచున్న పై బాల్యవివాహాచారమే నేటికి వారలలోని స్త్రీలయందుగల మహత్తరమగు

పాతివ్రత్యమునకుఁ గారణమగుచున్నది ఇంతియగాక వారి స్త్రీలలో గలుగు తీవ్రమైనట్టియు స్వభావజన్యమైనట్టియు యువతీజన యోగ్యమగు గరువతనమున కాధారమగుచున్నది. వారిలో నితరలోపము లింకేమైన యున్ననవియుండుగాక. యూరోప్రదేశమున కంతకు నీబీదకాపుజాతులే పాతివ్రత్యగౌరవమునకు చాలకాలమునుండియు నెంతో ప్రఖ్యాతి వహించియున్నారు.

("ఐరోపాదేశ నీతిచరిత్రము" లెక్కీ దొర వ్రాసినది.)

కన్యకా వివాహము లజ్ఞానవివాహములు కావనియు, వివాహ లక్షణ వ్యక్తత కన్యావయఃకాలముననే యేర్పడు ననియు, నిట్టి వివాహములు "విడుదలల"కును యింక ననేక గర్భనివారణలకు నవకాశ మొసంగ జాలవనియు, యువతీ సంఘమునందు పాతివ్రత్యము వృద్ధిసేయుననియు, ప్రేమతపంబొనర్ప కన్యకలకు బ్రహ్మచర్యవ్రత దీక్ష కవకాశ మొసంగుననియు, కన్యలకు తగిన వరునిగూర్చింపగలిగి దాంపత్యవిభూతి కాకరము లగుననియు, వీనివల్లనే "సంఘశుద్ధి" స్వతఃసిద్ధమే యగుననియు నిరూపించితిని—గ్రంథవిస్తరభీతిచే నింతటితో ముగించి తక్కిన విషయముల వ్రాసెదను.

## 3. అకాల శిశుమాతృమరణములు.

### శిశు జనన, మరణములు

బాల్యవివాహములవలన కన్యలకు గర్భాశయములు తగువరకు నభివృద్ధి చెందకుండుటచే వారలు కడు లేతదశలో నుందురనియు, నట్టి వారితో భోగించినప్పుడు పుట్టుసంతానముమిక్కిలి బలహీనమై జన్మించుననియు, దానంజేసి త్వరలో మరణించుచున్న దనియు, నందువల్ల దేశములో శిశుమరణములు లెక్కకు మించిపోవుచున్నవనియు సంస్కర్తలు పలవించు తృతీయఘోష.

ఇందేమాత్రమేని సత్యవాసనయే కానంబడదు. కన్యక రజస్వల యగుటయే సంభోగార్హతకు దగిన చిహ్నమని యెందరెందరో వైద్య శాస్త్రవేత్తలు వేనోళ్లఁ జాటుచు, కన్యక రజస్వల యయిన పిమ్మట చిరకాలము గర్భాధాన మొనరింపకుండ జాగుసేయుచో గర్భాశయములోని పిండాధారకములగు నరములు ముదరఁబాఱి దుర్ఘటమగు ప్రసవవేదనకుఁ గారణములగుననియు మందలించుచున్నారు. ఇట్లుండ

మన సంస్కర్తలు తమ కన్యలు రజస్వల లయిన చాలాయేండ్లవఱకు గర్భాధానము సేయకుండనుంచి పిల్లలు ప్రస్తుత సంఘనాగరకత లనంబడు నాటకములు, సినీమాల ప్రదర్శనములు, నవలాపఠనములు, సమ్మావేశ సభ్యతలు, ధర్మోపన్యాసములం బడి తిరిగి చెడముదిరినంగాని గర్భాధానార్హత రాదనియు వీరుతలంతురు కాబోలు?

గర్భాశయశాస్త్రసారాంశముల నవలనవల ద్రోసి లౌకిక పాండిత్యధురంధరులై శుష్కరాద్ధాంతముల వెలార్చుటవలన ఫలిత మేమి?

శాస్త్రవేత్తల యభిప్రాయము లేల వినరు?

The argument that boys and girls after attaining maturity are still not physically fit to beget offspring till a long time after it, is therefore but an empty prejudice, based upon a few cases, which may be explained satisfactorily by several other causes than the innocent system of early marriage."

*Havelock Ellis.*

బాలురుకాని బాలికలుకాని వారీడేరిన తరువాతను గూడ సంతానార్హులు కాలేదనుచు తరువాత చాలకాలమువర కట్టియనుకూల పరిపక్వదశ రాజాలదని తర్కించు సిద్ధాంతము కేవల నిరాధారము. శాస్త్రవిరుద్ధము. అట్టిదశలో వెనుబడిన వారొకరిద్దఱున్నప్పటికిని కారణాంతరము లింకేవైననుండవలయునే గాని నిరపరాధమగు బాల్యవివాహము లేమాత్రమును కారణములు కానేరవు.

హేవలక్ యెల్లిసుదొర.

సంఘసంస్కర్తలు కొందఱు 14 యేండ్లవచ్చినంగాని కన్నెలు రజస్వల కారనియు, నందువల్ల వివాహయోగ్యవయస్సు 14 యేండ్లవరకు పొడిగించిన దేశమున కేయపాయము లేదనియు తలంచుచున్నారు. ఇది శుద్ధ అబద్ధము. రజస్వలయగువయః కాలము సగటున.

| | | |
|---|---|---|
| కలకత్తాలో | 12 సం॥ | 4 నెలలు |
| డక్కన్ | 13 | 3 |
| ప్యారిస్ (ప్రాన్సు) | 17 | 2 |
| లండన్ | 15 | 2 |
| యూరోపు (హల్లీ) | 16 | 2 |
| నార్వేస్వీడన్ — | 16 | 10 |

ఇంతయేల ఇండియాదేశములో 14 యేండ్లకుముందే రజస్వల

యగువారు నూటికి 71 మందికలరని లయన్సు దొర మెడికల్ జూరిస్ ప్రూడెన్సు అను గ్రంథములో (Medical juris prudence by Dr. Lyons) ప్రకటించినసంగతి సంస్కర్త లెఱుంగుదురు గాక.

ఇంక సంతానార్థత విషయమై యనేక ప్రమాణములున్నవి కాని విస్తరభీతిచేత సంక్షేపముగ వ్రాసెదను.

గాలబిన్ తాను వ్రాసిన మంత్రసాని శాస్త్రము 45 పుటలో (Gallabins "Midwifery" Page 45) కాలిక ప్రథమ రజస్వల యగుటయే గర్భాధానార్థతకు కాల మగుచున్నదని వ్రాసియున్నాడు.

ప్లేఫెయిర్ దొర వ్రాసిన మంత్రసాని శాస్త్రము 72 పుటలో ("Science and Practice of Midwifery" by W. S. Playfair M. D., L. L. D. F. R. C. P.) రజస్వలయగుటయే గర్భాధాన ప్రాయమునకు సాక్ష్యమనుచున్నాడు. ఇంతియగాక రజస్వలయయిన తరువాత చిరకాలము గర్భాధానము గావింపకున్న నరములు ముదరబారి మృదుత్వము పోయి గట్టిపడి దురంత ప్రసవవేదనకు కారణ మగుచున్నదని 338 పుటలో వ్రాసి యున్నాడు:—ఇంకను హావలకు యెల్లిసు దొర 11 అధ్యాయము 524 పేజీలో రజస్వల యగుటయే స్త్రీల గర్భము పరిపక్వమైన దనుటకు ప్రబల ప్రమాణమని వ్రాయుచు, 636 పేజీలో కొన్ని ప్రమాణములం జూపుచున్నాడు:—

మిల్నర్ (Milner) అనుకన్య 14 యేండ్లకు నీళ్లాడెను. కొద్ది ప్రసవవేదనయే కలిగెను.

లాంసెటు పత్రిక 7-6-1902 లో చూడుడు. న్యూజెర్సీలో E. B. Males అను వాడిట్లు వ్రాసెను:—అచట 10 యేండ్లపిల్ల సమర్తాడెను, 11 యేండ్లకే పిల్లనుగనెను. సుఖప్రసూతి మగబిడ్డకలిగెను. బిడ్డతూకం 11 పౌనులు అనగా షుమారర్థమణుగు బరువుండెను. తల్లికి చక్కగా పాలుపడెనట.

(Cape Colony) కేపు కాలనీలో నొకకన్య 13 యేండ్లకే బిడ్డను సుఖముగా కనెనని British Medical Journal 18-1-1902 లో॥ రాబర్టుసన్ దొర వ్రాసియున్నాడు.

ఇంక నిటువంటి నిదర్శనము లక్ష్యదములు నిక్ష్యదములు కలవు. తామే విద్యావంతులమని దురూహలకుపు లొంగిపుత్రైకు దోచిన పుచ్చు తర్కము లింతటనైన సంఘసంస్కర్తలు కట్టిపెట్టెదరు గాక. శిశుజననము లిట్లుండ శిశుమరణముల సంగతి యాలోచింతము. బాల్యవివాహములవల్ల శిశుమరణములు కలుగుచున్నవని ప్రకటించి సంస్కర్తలు ప్రజలను మోసగించుచున్నారు.

శిశుమరణములు బాల్యవివాహముల కలవడిన జాతులలోనే తక్కువ- కడుతక్కువ. 1911 జనాభాలెక్కల ప్రకారము.

| దేశము పేరు, | బాల్యవివాహములు నూటికి | శిశుమరణములు నూటికి |
|---|---|---|
| దర్భంగ | 57 | 13 |
| డార్జిలింగు, పూరి | 17 | 22 |
| జైల్పాయిగిరి | 5 | 27 |
| బర్మా (Upper) | 4 | 41 |
| (Lower) | 4 | 47 |
| చీనాం | | 32 |
| రష్యా | | 25 |
| హంగెరీ | | 20 |

ఇంతకంటె సాక్ష్య మింకేమికలదు. అంతదూరము పోనేల మద్రాసు పట్టణము సంగతి నాలోచించుకొనుడు.

The Corporation authorities lately published their death rate returns for 1926—27. These figures show clearly that in most "early married community, the Brahmins, the infantile mortality *is lowest.*" '*Page* 35 '*Rationale of Early marriage*''

చెన్నపట్నములో మునిసిపాలిటీ అధికారులు తామిటీవల 1926-27 సంవత్సరమునకు ప్రకటించిన గణితములలో శిశుమరణములు విడిగా ప్రకట్రించబడినవి. ఆలెక్కలఁజూచినచో బాల్యవివాహములను దక్క యితరరకపు వివాహము లెటుంగని బ్రాహ్మణజాతిలోనే శిశుమరణములసంఖ్య కడుంగడు తక్కువగా గన్పట్టుచున్నది. (35 రేషనలు ఆఫ్ అర్లిమారేజి)

## 2 స్త్రీల మరణములు.

ముద్దు లక్ష్మమ్మగారు M. L. Cస్మృతిక ర్త్రిణీదేవిగారై తాను బ్రాహ్మణయువతుల గర్భరోగముల చక్కగా నెఱుంగుదుననియు, నట్టి రోగములు బాల్యవివాహ సంజనితములే యనియు నొక్కస్వానుభవ రాద్ధాంతము వెల్లడింపవచ్చును. సమిష్టి సంఖ్యల నెఱుంగక నెవరో నల్వురు నిర్భాగ్యలకు గర్భరోగము లెందుచేతనో కలిగినందున తనవద్దకువచ్చినంత మాత్రముననే తదవస్థ సార్వజనీనమేయని ఆసిద్ధాంతమునకు గంతులు వేయవచ్చునా?

We find from the census report that the feminine mortality even in Bengal is considerably lower than that in Scotland and Ireland.

జనాభాగణితములను పరిశీలించినచో అయిర్లండు స్కాట్లండు దేశములలో కంటె బెంగాలు దేశములోనే స్త్రీ మరణసంఖ్య చాల తక్కువపడుచున్నవి.

ఇంతియగాక స్త్రీ పురుషమరణ సంఖ్యల పోల్చినచో

| | | |
|---|---|---|
| బెంగాలులో | 91 % | బాల్యవివాహము |
| బీహారు | 89 % | |
| యూరోపు | 90 % | ప్రౌఢావివాహములు |

యగుచున్నవని వ్రాయుచు Mr. O Mally దొరగారు బాల్యవివాహములుసేయు దేశమునకు, చేయని దేశములకు వ్యత్యాసమే లేదని వ్రాయుచున్నాడు. జనాభారిపోర్టు 233 పుటలో మహమ్మదీయ స్త్రీలలోకంటె హిందూ స్త్రీలే యెక్కువ కాలము బ్రతుకుచున్నారని వ్రాయబడినది.

మవులానామియదు హజుద్దీన్ ((Maulana Miyad Hazuddin) సగటున హిందువుడు 102 జీవించుచున్నాడు. కాని మహమ్మదీయుఁడు 76 సం॥ మాత్రమే బ్రతుకుచున్నాడని వ్రాసియున్నాడు.

అగ్బర్ కాలమునాటి "Abul Fazal" అబుల్‌ఫాజలు అనువారు, "హిందువులు 90 యేండ్లు సగటున బ్రతుకుచున్నారనియు, మహమ్మదీయులు 78 మాత్రమే జీవించుచున్నారనియు ప్రకటించుచున్నాడు.

బాల్యవివాహము నెఱుంగనివారిలోకంటె బాల్యవివాహము లవలంబించెడివారిలోనే చావులు తక్కువగానున్నచో నిది ప్రబలసాక్ష్యమా? ముద్దులక్ష్మమ్మగారు పరీక్షించిన బ్రాహ్మణ ముత్తైదువుల సాక్ష్యము ప్రబలప్రమాణమా? చదువరులే నిర్ణయించుకొందురుగాక.

సంస్కారులుపెట్టిన పిచ్చి తర్కములలోమునింగి యీడు ముదిరినంగాని గర్భాధాన వివాహముల నాచరింపని దేశములగతి లజపతిరాయి. అన్ హాపీ ఇండియా 214 పేజీలో:—H. Ellis యిట్లువ్రాయుచున్నాడు.

In some countries the same writer continues, it is said to be almost a universal practice for the women to have sexual relationship before legal marriage; sometimes she marries the first man whom she tries; sometimes she tries several before finding the man who suits her......Thus in some parts of Strafford-shire it is the custom of women to have a child before marriage...in Sweeden Ellis states on the authority of Ellenkey, 'the majority of the population begin married life in this way.

స్త్రీలు కొందఱు తాము మొదటమెచ్చి చూచిన పురుషునే పిదప పెండ్లాడెదరట. మఱికొందఱట్లు గాక తమకుఁదగిన వరుని నిర్ణయించుకొనుటకు మెచ్చుకై యనేకులగలసి చరింతురట. ఈరీతి (Strafford) స్ట్రాఫర్డులో పిల్లగన్న తల్లులకే పెండ్లిండ్లగునట. స్వీడన్‌లో (Ellen Key) కీ దొర వ్రాసినట్లు యెక్కువ భాగము చంక బిడ్డ తల్లులకే వివాహములట. డెన్మార్కులో ననేకమంది బిడ్డలు యవివాహిత కన్యా సంతానమేనట. మనదేశమునం దట్లుగాక బాల్యమందే కన్యకల నొకనికి కట్టివైచి వాని క్షేమాభివృద్ధికై తపస్సుగావించుటకు కన్యలను బ్రహ్మచర్యదీక్షలోనిలిపి రజస్వలకాగనే భర్త్రన్వేషణ మాన సాందోళన కవకాశమివ్వక మెచ్చుపెండ్లిండ్లకు మానసరా శృంగారములకు వీలులేకుండగావించి సంఘమును కాపాడి శిశుమరణములకుగాని స్త్రీమరణములకుగాని రవంతయయిన యవకాశమివ్వనట్టి మన వివాహములు మంచివా? సంస్కర్తలు పత్రికలలో చదువుకొని సంతోషించు పై అడ్డగోలు హఠాత్తు పెండ్లిండ్లు మంచివా! మీరేసెలవిండు.

# బాల్య వివాహ తత్వసారము.

## రెండవ యధ్యాయము.

### ప్రేమబంధము, సంసారము.

---

శ్రీపరమేశ్వర నిర్మితంబగునట్టి జగజ్జాలమునందలి జీవకోటు
లలో మానవుఁడే మేటిగాఁ బఱగుచున్నాఁడు. తక్కుంగల జంతుసము
దాయమునందు కొన్నికొన్ని మానవ జాతులకంటె పశు బలము
నందు మాత్రము మిక్కిలి మేరమీరి యున్నంగూడ విజ్ఞానమునందు
మాత్ర మన్నియు వెనుకఁబడుచున్నవి. దానంజేసి మానవునకుఁ దదితర
జీవకోటుల కంటె ప్రత్యక్షమగు వ్యత్యాసము విజ్ఞాన మొక్కటియేయని
కనుపించుచున్నది. అట్లయినంగూడ మానవులందుండు ప్రేమబంధము
పరస్పరహృదయాకర్షణమునకు హేతుభూతమైనట్లే క్షుద్ర జంతువు
లందుసైతమట్టిప్రేమకళయే ప్రతిఫలించుచున్నది. ఇంతయేల జీవకోటుల
నటుండ నిచ్చినను భగవద్రచనయందు ప్రేమలక్షణమగు పరస్పర హృ
దయాకర్షణము ప్రాయికముగా నచేతనములందు సైతము విరివిగాఁ
గన్పట్టుచున్నది. తనయునిజూచిన తల్లివలె సముద్రము చంద్రునిఁ
గన్గొని యెట్లు మిన్ను ముట్టి యుప్పొంగుచున్నదో చూడుము! ఈరెండ
చేతనములకు సాంసారికప్రేమ స్వరూపమనందగు పరస్పరాకర్షణశక్తి
యెచటనుండి వచ్చినది? అట్లే చిరప్రవాసితుండగు భర్త తిరిగి యింటి
కరుగుదెంచుటంగని పతివ్రతల ముఖపద్మము లెట్లు వికసించునో యట్లే
సూర్యుఁడుదయించుటంగని కమలము లెట్లు వికసిల్లునో జూడుఁడు.
ఎక్కడి ప్రేమబంధము. కోట్ల కోట్ల యోజనములందున్న వీరి కెక్కడి
చుట్టరికము? ఎక్కడి యాకర్షణశక్తి? అచేతనముల కీ సామర్థ్య
మిచ్చిన దెవ్వఁడా పరమేశ్వరుఁడే కాదా? వేయేల మనమందఱము
నేఁటికిఁ బ్రత్యక్షముగా ప్రొద్దు తిరుగుడు పూలను జూచుచుండలేదా!
సూర్యుడెక్కడ? పూవులెక్కడ? రవితో వాటికేమి జోలి. నాయికతన
నాథుని వెంటఁ దగిలి పోవునట్లు కుసుమము లేల భాస్కరుందగులొక్కని

పోవలయును? ఔరా! ప్రేమబంధము దూరమెఱుంగదు. నిజము. ఇం కననేక కారణముల వల్ల పరస్పరా కర్షణమునకుకారణం బగు ప్రేమ చేతనా చేతనములం దెల్లెడలఁ బ్రతిబింబించుటంజేసి యీప్రపంచ మంతయుం బ్రేమ మయమైనట్లు తోఁచుచున్నది. ఇట్టిప్రేమ సర్వజగ త్కారణమగుట చేతనేకాఁబోలు దైవము ప్రేమ స్వరూపుఁడుగాను దయాసముద్రుఁడుగాను బలుకుచున్నాఁడు. ఈ ప్రేమతత్వమును ప్రాచీప్రతీచీ పండితులందఱు నంగీకరించియున్నారు.

"It is much for our pure natural history to recognise that " Creation's final law is not struggle but LOVE "

"*The Evolution of Sex*" by Prof Gaddes and Thompson.

ఈ సృష్టియందలి ప్రధానసూత్రరహస్యము "ప్రేమ" మాత్రమే యగును గాని గింజుకొనుకొనుట కాదని మనమంగీకరింపవలయును. అట్లగుటచేతనే మనస హజ చారిత్రమును బలపరుచుటకు తోడ్పడుచున్నది."

ప్రొఫెసర్ గెడ్డిస్ థాంసన్ దొరలువ్రాసిన

"స్త్రీపురుష పరిణామము" అనుగ్రంథము.

ఈ ప్రేమయే సంసారమునకు మూలస్తంభము. ఈ సాంసారిక ప్రేమ స్త్రీపురుషుల దాంపత్యములందు జన్మించి కుటుంబముల వఱకు వ్యాపించి, సంఘముల దాక విస్తరించి, గ్రామములఁ జేరి విజృంభించి, దేశము నందతటను జల్లుపొల్లు లేకఅల్లుకొని, లోకములన్నింటి కెగఁ బ్రాఁకి, పరమేశ్వరుని పాదసన్నిధికీజీవకోటులను యీసోపానము లెక్కిం చి తీసికొనిపోయి చేర్చుచున్నది. ఇయ్యది ప్రేమ స్వరూపిణీయాత్రా విధానము. మిత్రులారా! ఇట్టి ప్రేమశక్తియే లేకున్నదాంపత్యము శూన్యము. అది లేకున్న కుటుంబము సంఘము గ్రామము దేశము లోకము దైవము మొదలగు సోపానమార్గములన్నియుసర్వశూన్యములు గాని వేఱొండేమైన మిగిలియుండునా?పశుపక్షులందువలెనే మానవులం దరును "ఎవరికి వారే యమునాతీరే" యన్నట్లు కీల్లూడిన బొమ్మలేకా వలయునుగదా. పశుపక్షులకు విజ్ఞానము కొరంతవడుటచేత గాఁబోలు అవి ప్రేమను మాత్రమే యెఱుంగునుగాని మిగిలిన సోపానముల నెఱుం గవు. ఈశ్వరుఁడు పశుపక్షులకు విజ్ఞానమిచ్చి సంసార నిర్మాణమునకుం

దగినపాటవ మొసంగనందులకుఁ బ్రత్యామ్నాయముగా గాబోలు వాని సంతానములకు పోషణావశ్యకతను స్వల్పముగా నిర్ణయించి యున్నాఁడు. పశుపక్షులలో దాంపత్యము తత్తత్కాలికముగా పుట్టు శృంగార రసము వల్లగాని బలాత్కారణమువల్లగాని సంభవించి పిమ్మట స్త్రీపురుషజాతి కట్టి సంబంధము లేకుండనే సంతాన పోషణయందు తమకు ఎక్కుడు బాధ్యతలు లేకుండును. కని పార వేసి కొలదిరోజులకే రెక్కలు రాగనే తలిదండ్రుల విడిచి యెక్కడి వక్కడి కెగిరి యాడి పారి పోవుచున్నవి. కాని మానవులం దిట్టి విపరీత దశావిపాకమున కెడమే మాత్రము నీశ్వర సంకల్పితము కాదు. అట్లగుటచేతనే గాబోలు కోడెదూడలు యేడాదికే తల్లిని వదలును. తర్వాత త్వరగా అరకకు పనికివచ్చుచుండ, మనుష్యజాతిలో పసికూనలకు వత్సరముల కొలంది పోషణమవసరమగుచున్నది. ఇయ్యది మన కిచ్చు విజ్ఞానమునకు బదులుగా నివ్వంబడిన శ్రమ-శ్రమకాదు. ప్రేమానందము. కన్నబిడ్డలను బెంచుట కన్నతల్లి కానందమేది?

ఇంతవరకు వర్ణించినయంశముల పరిశీలించినయెడల పశుపక్షిజాతులందు దాంపత్యము (1) తాత్కాలికము (2) నియమాభావము (3) నిర్ణయరహితముగఁదోచును. అట్టిదాంపత్యము వల్లజనించిన సంతతి యెక్కడిదక్కడ పెరిగిన కొలందియు దూరదూరమై ప్రేమబంధమునుండి వీడిపోవుచున్నది. దానంజేసి పశుపక్షులకు సంసార చింత కుటుంబముఃయొక్క జంజాటము పూర్తిగా నక్కరలేనేలేదు. కానిమానవజాతి యందట్టి చింతకెంతయో యావశ్యకతకలదు. అట్లు గావునమానవుఁడు సంసారము నిలువద్రొక్కకుని కొంప గోడులేర్పరుచుకొనుట వానిలో దైవప్రతిష్ఠితమగు విజ్ఞానలక్షణము. పర్యవసానమేమన మానవులలో విజ్ఞానాధిక్యముండుటచేత సంసారమున్నూ నిలుకడగల్గిన గట్టిప్రేమబంధమున్నూ ఆవశ్యకమగుచున్నది. విజ్ఞానములేని పశుపక్షిజాతులలోని సాంసారికస్థితి నియమరహితమై తాత్కాలికమై జల్లెడదాంపత్యమును ప్రకటించు ప్రేమబంధముగ గన్పట్టుచున్నది

పాశ్చాత్యదేశములందు నేటికి జరిగించఁబడుచున్న వివాహ

ములు తాత్కాలికములుకదా. తాత్కాలికములన క్షణికములు. భార్యాభర్తలయందొక రొకరికి మోజు తీరినవెంటనే వీరిని వారు వారిని వీరు వదలివేయవచ్చును. దీనినే విడుదల (Divorce.) యను చున్నారు. మిస్ మేయో దొరసానిగారి అమెరికాదేశములో చూచి తిరా వివాహములకంటె డైవోర్సులు (విడుదల) లెక్కువగా లెక్కింపఁబడుచున్నవి. పాశ్చాత్యులలో నతినాగరికులందు జేరిన నారీమణులు

" They change their husbands as they change their coats."

తమదు స్తులను మార్చుకొన్నట్లే ఎప్పటికప్పుడు మగలనుగూడ మార్చుకొనుచుందురు.

లేకున్న నిన్నివిడుదలలకు కారణమేమైన యుండగలదా !

If there were 39,000 marriages in Chicago in the year of grace 1922, it is absurdly conservative that fully 26,000 would have gotten divorces if they could in addition to the 13,000 who did.

" The Revolt of Youth " Page 212.

The number of separations including divorces is now annually equal to the number of marriage licences granted (in Denver). And what is true of Denver is, as I have already said just as true of other cities.

Page 214 (Ibid).

చికాగోపట్టణములో 1922 సంవత్సరము జరిగిన 39,000 పెండ్లిండ్లలో విడుదల పెట్టబడిన 13,000 పెండ్లిండ్లుగాక 26,000 పెండ్లిండ్లు (బహిరంగము గాకుండ) విడుదలపెట్టినట్లే తలఁచుట యేమాత్ర మతిశయోక్తి కానేరదు.

''రివోల్టు ఆఫ్ యూత్'' 212 పుట

విడుదలలో గలసి చేర్చబడిన భార్యాభర్తల వివాహవిభ్రంశములు లెక్క పెట్టి చూచినచో డెన్వారు జిల్లాలో జరిగిన వివాహముల సంఖ్యతో తులదూఁగు చున్నది. ఇంతకంటెంగూడ నిజమగు విషయము నేనిదివఱకే వ్రాసిన ప్రకారం ''డెన్వారు''లో జరిగిన సంగతు లమెరికాలో నన్నిపట్టణముల లందిట్లే జరుగు చున్నవి.

అదేగ్రంథము 214 పుట.

స్త్రీలు తమరుకోరుకొన్నవరుని పెండ్లాడు స్వతంత్రము ననుభవించుచున్న దేశములందు జరుగుచున్న దురాగతము లిట్టివే సుమీ.

ఈ పై విషయముల గమనించిచూడ వివాహములెన్ని జరిగెనో విడుదలలన్నియే జరిగినట్లు ధ్రువమగుచున్నది. పర్యవసానమున వివాహమే గుండుసున్న క్రిందికి తేలుచున్నది. దానంజేసి పాశ్చాత్యఖండ రాజమునందగు యమెరికాసంయుక్త రాష్ట్రములలో నేమి తదితర ప్రదేశములలో నేమి పెండ్లిండ్లేమియును జరుగలేదనియే భావింప వలసియున్నది. జరుగనిచో సంఘ చక్ర మెట్లు దిర్దిరందిరుగుచున్నదని మీరు ప్రశ్నించెదరేమో వినుండు.

"Decrease of marriage, increase of divorce and presumed increase of concubinage and promisceiety mean relapse in the direction of animalism and failure of natural affection for children and their consequent neglect. They indicate either a stupid failure to understand that maintenance of *home* is necessary to the perpetuation of civilisation and free government and worse still a callons indefference to the fate of these institutions.

"*Man hood and Marriage*" *Page 89*,

'వివాహముల సంఖ్యలలో తక్కువగుట విడుదలలసంఖ్య లెక్కువగుట, వీటి రెంటివల్ల నూహింపఁదగిన లంజెరికముయొక్కయు యథేచ్ఛాభోగములయొక్కయు లెక్కలు మిక్కిలి యగుటయును జూడమానవజాతి క్రమక్రమముగా పశుజాతిలోనికి గలియఁబోవుచున్నట్లే యర్థమగుచున్నది. దానంజేసి సంతానమునందు దంపతుల కుండవలసిన యభిలాషయును స్వాభావిక ప్రేమయు నశించుచున్నది. సంతాన మక్కరలేకుండటయే కోరంబడుచున్నది. దీని యంతరార్థ మేమనగా స్వాత్మ విజ్ఞానజాతీయగౌరవములను స్వాత్మప్రభుత్వమును శాశ్వతముగ నెలకొల్పగలిగిన సంసారము (Home) నందలి ప్రయోజనము మానవునికర్థము కాలేదని తోచు చున్నది. ఇంకన న్యాయమేమన వీనియభివృద్ధి విషయమై నరునకు నిర్లక్ష్యము జనించుచున్నది.

మ్యాన్‌హుడ్ & మేరీజి పుట. 89

చదువరులారా. జల్లెడవివాహము లనగా ఇట్టివేగదా. ఇవి సాంసారిక నియమ రహితములై యథేచ్ఛములై, నిర్ణయ శూన్యములయి యుండును. ఇవి మానవజాతిలో పరమేశ్వరుఁ డుద్దేశించిన వివాహ లక్షణము లేనా? లేక పశుపక్షిజాతుల కుద్దేశింపంబడిన లక్షణములా మీరే యాలోచించుకొనుడు, ఇంతయేల పెండ్లిండ్లు కట్టుదిట్టము లెరుంగనిచో నిట్టి విపరీతపరిణామ దశకు దిగినందున మానవుఁడు

పశుప్రాయుఁ డగుచున్నట్లు పాశ్చాత్య విమర్శకులే ఇట్లు జెప్పుచున్నారు.

It (Marriage successful) remains a necessity if man does not wish to sink into decadence and thence gravitate towards the level of the brute"

*Macfadden in "Manhood and Marriage" Page 89*

మానవుఁడ ధోలోకమునంబడి క్షీణదశల క్రుంగిమృగములతో పాటుగా మారకుండవలయునన్న వివాహబంధ మత్యావశ్యక మని స్పష్టముగాఁ దేలుచున్నది.

మ్యాన్‌హూడు & మేరిజి 89 పుట.

ఈశ్వరునిచేత మానవసంఘముకొరకై నిర్ణయింపఁబడిన వివాహధర్మము పాశ్చాత్యదేశములలో సాఫల్యమునొందెనో లేక వైఫల్యమునందెనో మీరే నిర్ణయించుకొనెదరు గాక.

మా పాఠకుల వినోదార్థమై యమెరికా సంఘచక్ర పరిభ్రమ సరణిని కొంతవర్ణించెదను:—

From New York times:—

" Her (thirteenth divorce was granted to Mrs. Corayates in the city Court to-day.——In the same court on Dec. 11th last Mrs. Yates obtained divorce from A. Lelley to whom she had been married three times. Before her first marriage to Lilley, that woman had been wedded to nine different men—Not an unusual occurrence.

" Uncle Sham "

Page 145.

కోరాయేట్సుదొరసానికి పదమూడవ విడుదల యీరోజున బస్తీకోర్టులో మంజూరయినది. ఆకోర్టులోనే డిశంబరు॥ 11 తేదీని యేట్సుదొరసాని లిల్లీదొరగారివలననుండి మూడుపర్యాయములు విడుదల డిక్రీలను పొందినది. లిల్లీదొర నామెమొదట పెండ్లాడకముందాపె తొమ్మిదిమంది మగలను పెండ్లాడియే యుండెను. ఇవి సర్వజన సామాన్యములు.

అంకుల్‌షాం 145 పుట.

# బాల్య వివాహ తత్త్వసారము.

## మూడవ అధ్యాయము.

### కాయిక సిద్ధాంతములు.

సంఘసంస్కర్తలు మిన్నంటసేయు ఘోషంబులం గొన్నింటి నింతకుమునుపే నిరూపించి యుంటిమి. తక్కిన విచటం బొందుపఱచెదము. సంస్కర్తల సిద్ధాంతములను ముందుగ విభజించి నిరూపించుట మంచిది. వివాహసంస్కర్తలను ప్రస్తుతకాలదశ ననుసరించి మూడు తెగలుగా విభజింపవచ్చును.

(1) కాయిక సిద్ధాంతులు
(2) విద్యాక్షేమ సిద్ధాంతులు
(3) ఆర్థికపుష్టి సిద్ధాంతులు.

ఇందు మొదటి శాఖవారి తర్కముల నిందు బరిశీలింతము.

(1) వర్ధమానకాలము.

మానవుల శరీరములు సాధారణముగ 25 యేండ్లవఱకుం బెఱుగుచునేయుండుననియు, నట్టి వర్ధమానదశ పరిపూర్తికానిదే మానవశరీరమునకుం జక్కని పరిణామ సమగ్రత సిద్ధింపం జాలదనియు, అట్టి పరిపూర్ణత్వము లభింపకయమున్నె దేహబలమును వ్యయపఱుచు స్త్రీసంభోగాదులవలన బలపాటవములు నశించి, వర్ధమానదశ వెనుకంజవేయుట తటస్థించి స్వభావసిద్ధమైనట్టిదియుం బరమేశ్వరునిచే నుద్దేశింపంబడినట్టిదియునగు వర్ధమాన ప్రక్రియకు నడ్డుకలిగించి వెనుక వెనుకకుం బడద్రోయును గాన, 25 యేండ్లలోపల స్త్రీపురుషుల వివాహములు (అనగా సంగమములు) బహుళానర్థదాయకము లనియు కాయికసిద్ధాంతుల తర్కము.

(2) సంతానబలము.

ఈ విధముగాం బెండ్లాడిన దంపతులకు జన్మించిన సంతానము

చాలబలము గలిగి సర్వావయవ సంపూర్ణత కలిగి యుండుననియు గూడ వీరి సిద్ధాంతము.

(౩) అకాల మరణములు.

అట్టి కాలమందనగా శరీరములు పూర్తిగా బెఱిగిన తరువాత పుట్టిన శిశువులు మరణించుటలు కడుంగడు తక్కువ యనియుగూడ వీరు సిద్ధాంతము సేయుచున్నారు.

(౧) రజస్వలాచిహ్నము. వర్ధమానకాలసిద్ధాంతఖండనము.

ఈసిద్ధాంతమునం దేమాత్రమేని సత్యము కనుపించదు. ఏలయనగా శాస్త్రవేత్తలు పరీక్షించి యేకగ్రీవముగా రజస్వలయగుటయే సంభోగార్హతకుం గాని సంతానార్హతకుంగాని ప్రబలమైనట్టి నిదర్శనమని చాటుచున్నారు గదా.

The first menstruation is the usual sign that girl has become capable of conception and child bearing.

*Gallabin "Midwifery" Page 45.*

(స్త్రీలకు సంభవించెడి ప్రథమ రజోదర్శనమే వారికి గర్భధారణమును బిడ్డలఁ గనుటకును తగిన వయస్సు వచ్చినట్లు నిరూపించుటకు సర్వసాధారణ చిహ్నమై యున్నది.)

(పుట 45 గాలబిన్ వ్రాసిన "మంత్రసానిశాస్త్రము")

ఈ ప్రకట బహిరంగ చిహ్నమగు రజస్వలదశను, మనమంగీకరించక తప్పదు. సంఘసంస్కర్తలిట్టి గుర్తు నేదేనియింతవఱకుఁ గనుపెట్టిరా? లేక యేదేని సంభోగ సంతానార్హ కాల చిహ్నముల గుఱించిగాని జూపింపఁ గలిగిరా? మానవజాతులు మోహాంధతలోఁ బడి తెన్నుగానక నవనాగరికులమని చెప్పుకొనుచుఁ బత్రికలను బలాత్కార సుఖములతోడను, అవ్యక్త స్త్రీ సుఖములతోడను బూరించుకొనుచుండు కొన్ని దేశములలో వలెనే చెడిపోదురేమోయని కాబోలు, పరమేశ్వరుఁడీ ప్రకట బహిరంగచిహ్నము నొక దానిని మానవజాతికి నేర్పఱచెనని తోచుచున్నది. అదియె శాస్త్రదృష్టితో జూచిన చక్కని నిజమునకు సమన్వయించుచున్నది.

The first appearance of menstruation coincides with the establishment of puberty and the physical changes that accompany it indicate that the female is capable of conception and child bearing.

*The Science and Practice of Midwifery by Play fair.*

(స్త్రీ) యీడేరినట్లు సంస్థాపించుటకు ప్రథమరజోదర్శనమే నిదర్శనము. తత్కాలమునకు తరువాత శరీరములో గలుగు మార్పులు నారీమణులు గర్భిణులై సంతానముఁ గాంచుటకు సంసూచకములై తనరారుచున్నవి.

(ప్లేఫేర్ వ్రాసిన "మంత్రసాని శాస్త్రము"]

అదియునుంగాక రజోదర్శనము కామోదయమున కొక యుదాహరణము. కామ మనునది యొక విధమగు వేడి. ఇట్టి వేడి శరీర జనితమైననుఁ గూడలోనున్న కాకకు వెలినున్న కాక కొంత కొంత ప్రోద్భలకము కాక మానదు. అందువల్లనే యుష్ణదేశములం దాచారము లేనట్టియు శరీరమునకు కాకను బుట్టించి కామోద్రేకమును హెచ్చుచేయునట్టియు మద్యపానాదులగు బహిరంగ సాధనములు శీతల దేశములం దన్నపానాదులతోఁ బాటుగా జరుగుచున్నవి. కాని యుష్ణదేశములం దంత విచ్చలవిడిగా గనుపించవు. ఇట్టి వేడి కొన్ని దేశములలో మిక్కుటముగానుండుటచేతనే అత్యుష్ణదేశములలోని కన్నెలు 10 యేండ్లకే రజస్వలలగుచుండ చల్లని దేశములలో 16 యేండ్లవరకు రజస్వలలు కాకుండుట తటస్థించుచున్నది. ఇట్టి సందర్భములలో 16 యేండ్లకు రజస్వలకాని యింగ్లండులో వివాహ శాసన వయస్సు 12 యేండ్లుండుటయు 10 యేండ్లకే సమర్తాడు మన వేడిదేశములో 14 యేండ్లకుంచుటయు జూడ మనశాసన కర్తలకున్న ప్రపంచక జ్ఞానము స్పష్టమగుచునే యున్నది. మనదేశమింగ్లాండు దేశమునకంటె చల్లని దేశమనియో యిక్కడ పిల్లలంతకంటె వెనుకబడి రజస్వలలగుదురనియో గాబోలు శారదాబిల్లునకు గవర్నమెంటువారు కేలూత నొసంగి యెట్లో శాసనమును నెగ్గించినారు. శాసన సభ్యులలోగాని గవర్నమెంటు మెంబర్లలోగాని సరియైన గణితపు లెక్కల (Statistics) నెవరైనాకనుపరచి ప్రజలనుతృప్తి పర

చినారా. వారు నియమించిన (Age of Consent) సబు కమిటీరిపోర్టులో
స్వారభ్యమును నలుగురు చవిచూడకమున్నే యదరాబదరాగా యీ
ల్లును శాసించుటకుగల హేతువును కనుపరచుట శాసనకర్త
భారమై యున్నది. అవును భార మగుటచేతనే మానిరి కాబోలు.

(2) నాళ జటిలత్వము.

ఈ కాముకసిద్ధాంతు లింకొక సంగతిని మఱచిరి. రజస్వల
చిహ్న ముదయించిన వెంటనే గర్భాధాన కార్యము సేయకున్న గర్భా
శయములోని నరములు ముదురుబారి పిదప ప్రసవవేదనకు దుర్భరత
మును కలిగించునని శాస్త్రజ్ఞులు తలంచుచున్నారు గదా. దీనికేమ
దురు. ఈవిషయము నిదివరకే జూపితిమి. తిరిగి మా చదువరుల కొ
కింద వ్రాయుచున్నాము.

It is also generally stated that the difficulty of labour incr
ases with the age of the patient and that in elderly primepara
is likely to be usually tedious from the rigidity of the soft part

*"The Science and procteso of midwifery" by Play fai*

(గర్భిణీస్త్రీలకు గలుగు ప్రసవ వేదన యీడు ముదిరిన కొలదియు మఱి
హెచ్చుచుండును. గర్భాశయములోని మెత్తని నరములు యీడుతో ముదిరి గట్టిబ
యుండుటయే యట్టి ప్రసవవేదనాధిక్యతకుం గారణము"

(ప్లేఫెయిర్ వ్రాసిన మంత్రసాని శాస్త్రము")

ఇంతియేగాక వేరొకచోట

Labour taking place for the first time in women advanced
life is also apt to be tedious especially in the first stage. It
probably more often referable to the regidity and tightness of t
particular passages than to feebleness of the pairs.

The articular cartilages of the coccyx become ossified, t
enlargement of the pelvic outlet during labor may be prevent
and considerable difficulty may thus arise. This is most apt
happen in aged prima para.

*The Science of Midwifery, by Play fair.*

(ఈడుముదిరిన యాఁడువారికి మొట్టమొదటి దశలో ప్రథమ ప్రసవవేదన క
దీర్ఘమై బాధాకరమై యుండకతప్పదు. దీనికిఁ గారణము నొప్పులు మెల్లమెల్ల

వచ్చుటయే యనుటకంటె గర్భాశయములోని కొన్ని ముఖ్యనాళములు ముదరఁబారి గట్టిపడియుండుటయే హేతువని చెప్పట మరింత వాస్తవముగా నుండును.

గర్భాశయములోని కొన్ని రక్తనాళములు గిటసఁబారిపోవును. నరముల ద్వారములు విజృంభించక నిరోధింపఁబడును. అందువల్ల ప్రసవము చాల బాధాకర మగును. ఇట్టిదుస్థితి యీడుముదిరిన గర్భిణులయందు మాత్రమే తటస్థించును.

(మంత్రసానిశాస్త్రము ప్లెఫెయిర్ దొర వ్రాసినది.)

ఈ పై సంగతులఁ బరిశీలించినచో రజస్వల చిహ్నమే స్త్రీల యొక్క సంభోగార్హతకు నిదర్శనమైనట్లును సంతానోత్పాదనశక్తికి సూచకమైనట్లును దెలుచుండ సంస్కర్తలు 25 యేండ్లవఱకు స్త్రీలను గట్టియుంచుమనుట కేమిహేతువో తెలియదు.

(3) జీవాణు ధ్వంసము.

ఇయ్యది ప్రబలనిదర్శనము. దీని యర్థమేమన స్త్రీలకు రజోదర్శనముతోపాటు కాలక్రమముగా జీవపరమాణువు లుదయించునని యు, తత్కాలమునందు సంభోగాదులను వర్జించుటవలన నట్టి జీవాణువులు తమంతట తామే నశించుననియు శాస్త్రవేత్తలు తలంచుచున్నారు. ఈమహాపాతక మొక భ్రూణహత్యక్రిందికే తేలుచున్నది. అందువల్ల జాతివెనుకబడకలదు. సంతానోత్పాదనశక్తితక్కువకాగలదు. ఇయ్యది దేశద్రోహము, జాతిద్రోహము. ఇతరదేశములలోవలె సంతానోత్పత్తి నిరోధకసాధనములు మన దేశములందు ప్రచారమునకు రాజాలవు. ఏలయన మన శాస్త్రము మనకు విధించిన సంస్కారములలో సంతానోత్పాదనకుఁగూడముఖ్యస్థానమిచ్చియున్నది. కావున నిప్పుడుపాశ్చాత్యులలో జరుగు నిరోధములు (Contraeptive Methods & Birth control) మనకు భయంకరములుగా సిగ్గుగాఁ గనుపడకతప్పదు. పోనిండు మనకు సంతానోత్పాదనము కర్మకాండలో జేర్చబడినందుననే మన మంత్రసాహసమునకుఁ జొరకుంటిమనుకొనకుడు. బుద్ధికల మానవమాత్రుఁ డెవ్వఁడుఁగూడ నిట్టి సాహసముల కొగ్గజాలడు. ఈసిగ్గుఁదెచ్చు సాధనముల గట్టుకొనుటకంటె చక్కని క్రమసహితమైన యింద్రియనిగ్రహమునే మన ఋషులు నేర్పియున్నారుగదా. పాశ్చాత్యులలోగూడ శాస్త్రవే

త్తలకుఁ గొందఱకిట్టి సిగ్గుపనులు రుచింపవు. ఈ క్రింద వ్రాయఁబడినట్టి వైద్యుల యభిప్రాయమును గమనింపుడు:—

It is evident to every thoughful person that a real sexual morality is almost impossible without early marriage; for, simply to refer the young to absistence as the true solution of the problem is, as we have already maintained, a crime against the race a crime which make the primietive force of natures, the fire of life into a destructive element.

*"Psychology of sex" by, Havelock Ellis.*

[సంభోగకార్యములందు వాస్తవమగు నీతినియమములు గావలయునన్న బాల్యవివాహములవల్లఁ గాక వేఱేమార్గమువల్ల సిద్ధింపఁజాలదని కొంచెముమాత్రమేని యాలోచనశక్తిగల ప్రతివానికినిగూడ స్ఫురింపకమానదు. ఏలయన మేమిదివఱకే ప్రకటించినట్లుగానె మనపిల్లలను వారీడేరినతరువాత బ్రహ్మచర్యము జరుపుమనుట యనునది సక్రమమయిన సాధకము గాకపోగా పైపెచ్చు మనము జాతిద్రోహమొనర్చినవార మగుచున్నాము. ఈద్రోహ మెట్టిదనఁగాఁ బ్రకృతిసిద్ధమయిన యొకానొక యనాదిశక్తిని, జీవకళను, కేవలము వినాశన పదార్థముగా మార్చినవార మగుదుము. (హెవలకుఎల్లిస్ దొర వ్రాసిన సైకాలజీ ఆఫ్ సెక్సు)

కావున రజస్వలానంతరమున వెంటనే గర్భాధానము సేయనిచో నింత జాతిద్రోహము సేసినవార మగుచుండ దీనినెట్లు చూచి చూచి సహింపఁగలము?

4. అక్రమసంతానభయము.

చదువరులారా! చట్టముప్రకారము 10 యేండ్లకు సమర్తాడిన పిల్లను 16 యేండ్లవఱ కద్దుగట్టియుంచుటవలన కలుగునట్టి పాతకమును గమనించితిరిగదా. సమర్తాడినతర్వాత 16 యేండ్లవరకు సంభోగము లేకుండ ప్రస్తుత నాగరికతాప్రవాహములో బడిన పిల్లలను నిరోధించియుంచుట సాధ్యమా యసాధ్యమా యనువిషయ మటుండనిండు. వేయేల అదియు దుర్ఘటమే.

Thirty or forty years ago, youth could not have flung such a challenge with the least hope of success: To day, the day of automobile the telephone, speed. good wages, and all we heard degree of economic independence for everybody, it can.

*The revolt of modern Youth, Page 33.*

(ముప్పదినలుబది యేండ్లక్రిందట నుండిన పడుచువారింత దౌర్జన్యముతో ధిక్క రించి గెలిచియుండరు-కాని యీ నాడు-యీ మోటారులు-యీ టెలిఫోనులు యీసత్వర యానములు-యీ గొప్పజీతములు-యీ ఆర్థిక స్వేచ్ఛ ప్రతివాని కుండుటవల్ల నీదురాగ తములు నేటికి సంభవములయ్యెను.

(రిపోర్టు ఆఫ్ యూతు పుట 33)

దానంజేసి యట్టికట్టుబాటు పూర్తిగా యసంభవముకాని కొందఱు సంస్కర్తలు ప్రత్యక్షనిదర్శనములను గొన్నింటిని కంటఁజూచుచున్నను సంఘదురాగతములు కొల్లకొల్లలుగా తమ శ్రవణపథంబున కెక్కి వచ్చుచున్నను కన్నులుమూసుకొని పాలుత్రాగు పిల్లులవలె, "ఆ ఏదో యొకటె చెడుదారిఁద్రొక్కిన యందఱట్లుచేయుదురా? అందఱు దుర్మార్గులయియుందురా?" యనుచు నేమేమో స్వల్పముగను బేలవముగను త్రోసివేయ సాహసింతురుగాని మనపిల్లలను కాపాడలేకపోదుమేమో యని జంకు కనుపరచుట లేదు. 10 యేండ్లకు సమర్తాడినపిల్లను 16 యేండ్లవఱకు నుంచు నెడల నీమధ్య నెన్నిదుర్గతులకుఁ బాల్పడునో యేదైవ మెఱుంగఁగలడు. పాశ్చాత్యదేశములలో రజస్వలలైన స్త్రీలు తాము పెండ్లిచేసికొనకముం దెందఱిని కని పారవేయుచుండిరో మాచదువరు లెఱుంగవలసియున్నది.

In New Zealand during the period 1913—1921, there were 10,841 illigitimate births and legitimate first births within one year after marriage. (If to the legitimate births we add the total number of live births occurring within the first 6 months after marriage—namely 12,235,—which may be safely considered to have been conceived before marriage we get a total of 23,076 births in which conception took place extra maritally. In other words more than 50 per cent of total first births occurring within 12 months of marriage result from sexual contact prios to marriage.) The remedy for this state of things is obviously early marriage and birth control.

*Safe marriage by Etti A Rout, Page 76.*

(న్యూజీలండు దేశములో 1913-21 సం॥ లలో పెండ్లియయిన యేడాదిలోపుగాఁ బుట్టిన (కొంతవఱకు) సక్రమసంతానమున్ను, బహిరంగముగా (తండ్రి నెఱుఁగని) యక్రమసంతానసంఖ్యయును గలిపితే 10,841 వరకు తేలుచున్నది. ఈసంఖ్యకు వివాహమయిన 6 నెలలలోపుగా పుట్టిన పిల్లలసంఖ్యను అనగా 12,235 ను

చేర్చవలసియున్నది. వీరు పెండ్లి గాకముందే గర్భములోబడినవారేకదా. అట్లైన మనమందఱము తలంచవలయునుగాని వేఱుమార్గము లేదు. ఆప్రకారం మొత్తంసంఖ్య అనగా పెండ్లి గాకముందుగానో కొంచెముదగ్గరగానటోయిటో యేర్పడిన సంతానసంఖ్య 23,076 అయినవి. దీనియర్థ మేమనగా వివాహమునకుపూర్వమే యేర్పడ్డ జననముల సంఖ్య మొత్తము జననములకు సగమునకు సగముగా దేలుచున్నది. దీనికి సరియైనపరిహారము బాల్యవివాహము)

సురక్షితవివాహములు, ఎట్టి-ఎ-రౌటుచే వ్రాయబడినది.

ఇట్టి యక్రమసంతానబాధ పైనుదహరించిన న్యూజీలండు దేశమునందేగాక సర్వసాధారణముగ బాలికలు తమభర్తను తామే నిర్ణయించుకొనవలయు ననుఅక్రమసిద్ధాంతమునకు దాసులగుచున్న పాశ్చాత్యుల దేశమునందంతట అనగా రజస్వలానంతరము ఆలస్యముగా వివాహములు చేసెడి ప్రతిదేశమందట్లే కనుపడుచున్నవి. ఆడుదానికి సమర్తాడకమునుపే యొకభర్తను జూపించి సమర్తాడిన వెంటనే యాభర్తకు నొప్పగించిన అన్నివిధముల శ్రేయస్కరమగును గాని 10 యేండ్లకు సమర్తాడిన పిల్లను 16 యేండ్లవరకు ఆపియుంచి తరువాత దానియిష్టముచొప్పున వివాహమును చేసికొనుమని చెప్పెడి చోట నీలోపుగా వారు దుర్గతులకుఁ బాలై సంతానప్రాప్తిని, తన్నిరోధయత్నములను జేసికొనుచు తుదకు తప్పించుకొనలేక కనివిడిచిన యక్రమసంతానములు లక్షలు కోట్లుగా నితరదేశములందు తెర్లి తెర్లి పోవుటఁ జూచియైనను మనసంస్కర్తలు తప్పుదారినుండి తొలగకున్నారుగదా. మనపూర్వుల యున్నతాదర్శములను వదలి పాశ్చాత్యాదర్శములను మనవారు బుద్ధిలేక అనుకరింపఁ జూచుచున్నారుగదా. వారి ననుకరించునప్పుడు రేపటినుండియు మనకుగూడ వారి దుర్గతియే యేల బట్టదు ? ఉష్ణదేశములలో 10 యేండ్లకు సమర్తాడి కామోదయమైన పిల్లను 16 యేండ్లవఱ కాపియుంచుట సర్వత్ర శ్రేయమని ఎవ్వరు చెప్పఁ గలరు? "బలవా నింద్రియగ్రామో విద్వాంస మపికర్షతి"

Love laughts at lacasincth.

గీ. మోహమిన్నుపతాళములతో మోహరించు
నింద్రియము వేత్తలకుఁగూడ తంద్రఁగొల్పు.

కావున నింద్రియములు మనల నెచటికీడ్చునో యెవరికెఱుక? వానిని నమ్మరాదు. రజస్వలలైనవెంటనే వివాహముసేయక యాలస్యముజేసినయెడల గలుగు ఫలితములు—అక్రమసంతానములు-తండ్రి నెఱుగని బిడ్డలు ప్రతిదేశమందును విచ్చలవిడిగా లెక్కకుమిక్కిలియై దనరారుచున్నారు. ఈక్రిందఁ గనుపరచిన జాబితావల్ల యితర దేశములెంత ఘోరదుస్థితి ననుభవించుచున్నవో మీరెఱుంగఁగలరు.

పెండ్లిగానివారికి బుట్టిన అక్రమసంతానము-తండ్రి నెఱుగని బిడ్డలు.

| సంవత్సరం. | దేశము పేరు. | పుట్టిన శిశువుల సంఖ్య మొత్తము. | అందులో అవివాహితలగు స్త్రీలకు బుట్టి తండ్రి యెవరో యెఱుగనిపిల్లలు |
|---|---|---|---|
| 1922 | బెలిజియం | 1,53,611 | 9,218 |
| 1921 | చైలు | 1,47,795 | 55,144 |
| 1922 | డెన్మార్కు | 73,866 | 7,681 |
| 1926 | ఇంగ్లాండు | 6,94,563 | 29,591 |
| 1921 | ఫిన్‌ల్యాండు | 82,165 | 7,803 |
| 1922 | ఫ్రాన్సు | 7,59,864 | 65,568 |
| 1921 | జర్మనీ | 16,11,420 | 1,73,169 |
| 1922 | ఇటలీ | 11,24,512 | 49,841 |
| 1921 | నెదర్లాండు | 1,81,186 | 3,652 |
| 1921 | నార్వే | 64,857 | 5,018 |
| 1926 | స్కాట్లండు | 1,02,449 | 7,046 |
| 1919 | స్వీడెన్ | 1,15,193 | 15,063 |

Whitakirs Almanac 1929.

విటేకరు 1929 పంచాంగము.

ఈఅంకెలనుజూచిన గుండె లదరుచున్నవి. దైవమా! పాశ్చాత్యమానసపుత్త్రిలగు మన నవనాగరికులు వివాహ విషయమునందు కూడా పాశ్చాత్యుల ననుకరింపఁ జూచుచున్నారే. యేనాటికైనను మన భరతఖండముకూడా యీజాబితా కెక్కకతప్పదేమో యని భయమగుచున్నది. ఇప్పుడే మనము మేల్కొని ఈదురనుకరణమును నిరోధించనియెడల ఎప్పటికైనను మనదేశమునకుకూడ ఆదుర్గతులు తప్పనే తప్పవు. పిల్లలు తలిదండ్రులను విడిచియుండజాలరు. ఇంతేగాక తలిదండ్రులు పిల్లలనుగూడ విడిచిపెట్టి యుండజాలరు. సమర్తాడినయెడల కన్యాదానఫలము తగ్గునని కొందఱున్నా, సమర్తాడులోపల పిల్లకుఁ బెండ్లిసేయనియెడల కన్యాదానఫలము పోవుటయేగాక సంఘబహిష్కారముకూడ సంభవించి సిగ్గు చెడునేమో యని జంకుచే కొందఱును తప్పనిసరిగా తమపిల్లలకు యుక్తకాలమునందు బెండ్లిండ్లు సేయుచు తమపిల్ల యప్పటప్పటికే తమ యిల్లువిడిచి పోకున్నను గూడ వప్పగింతలనాడు బోరున యవాచకపుకన్నీరు గార్చెదు తలిదండ్రులు-నేను తలిదండ్రుల నిందించుచుంటినని తలంపకుడు; ఇయ్యది ప్రేమ-సాంసారిక ప్రేమలోఁగల మాహాత్మ్యము-అట్టితండ్రులు రేపురేపు యని నెత్తిపుండు రేపువఱకును తమపిల్లల పెండ్లి సేయక కాలయాపన జరుపకతప్పరు. అక్రమసంతానము లుండకతప్పవు. ఇయ్యది మనకీ శారదామహానుభావుఁడు తెచ్చిపెట్టిన భిక్షయని యీనాఁడైనను మన సంస్కర్తలు నోటిమీద చేయివేసుకొనక తప్పదు. ఇట్టివివాహములు వాడుకలోఁగల దేశములస్థితిని జూచియైనను నేర్చుకొనవలసిన విషయములను గమనింపక కన్నులుమూసుకొన్న ఫలములేదు. నేనసహ్యముగ నిందించితినని నన్ను దూరకుడు. ఇతరుల ననుకరించునప్పుడు ఆ దేశములకుఁ బట్టిన దుర్గతియే మనకును పట్టక తప్పదు. తాతకుఁబెట్టినదే తరతరాలకుగదా! సాధకబాధకముల నాలోచించి ప్రవర్తింప వేడెదము.

## 5. అక్రమేంద్రియనిగ్రహము.

మానవులకు 25 యేండ్లు వచ్చినంగాని సంభోగార్హత సిద్ధించ

దను సిద్ధాంత మింక ననేకములగు యనర్థముల కాకరమగుచున్నది- మే మిదివఱకు చెప్పినట్లు రజస్వలాచిహ్నము సంతానాధికారమునకుం గుఱుతుగా బరుగుచుండ చూచిచూచి సృష్టిలోని రచనావిధానము చక్కనిక్రమముతోడ నీశ్వరునిచే నడిపింపఁబడుచుండ నట్టిక్రమ మును గాదని గీటునఁ బుచ్చి యీశ్వరుని సృష్టికి మెఱుఁగు వెట్టఁ దలంచుట మానవులందుగల మోహాంధతా ప్రభావమేగాని వేఱొండు కాజాలదు. ఒకవేళనట్లు మెఱుగువెట్టదలచిన నట్లు 25 యేండ్లకే పెండ్లాడిన వారికెందఱకు ఎంతసంతానమో, వారిసంతానమున కెంత పరిపూర్ణత్వమో నిరూపించగల నిదర్శనములు లేనేలేవుగాన యూహా పోహాలు ప్రయోజనకరములుగావు. ఏసంస్కర్తలుగూడ దీని విష యమై తగువిచారణఁ గావించినట్లు తోచదు. ఇంతియగాక యీ మాయ కాయికసిద్ధాంతము ముజ్జగంబులలో నేజాతికింగూడ నచ్చ లేదని స్పష్టమగుచున్నది. ఏదేశమునందుగాని యేజాతియందుగాని యిట్లు 25 యేండ్లవఱకు వివాహముల నిషేధించి క్రమముగా తత్ఫల ములఁ జవిచూడ సాహసించినజాతియేదియు కానరాదు. ఈయదియె యీతర్కమును, చక్కగా భూస్థాపనము గావించుచున్నది. అది యటుండనిచ్చి వధూవరులను 25 యేండ్లవఱకు నిరోధించిన యెడల స్త్రీలకు జీవాణుధ్వంసము కలుగుచున్నదని చూపితిమిగదా. అట్లే పురుషులకుం గూడ యనర్థదాయకమగుచున్నది. సంసారపథంబునం దున్న నరమాత్రులకు సామాన్యదృష్టితోడ నవలోకించినచో సం భోగ కార్యముగూడ సాధారణముగ మూత్రవిసర్జన తుల్యముగాఁ గన్పట్టుచున్నది. గురుశిక్షవడసి జ్ఞానముగడించి యూర్ధ్వరేతస్కులైన యోగులకుఁ దక్క సంసారమున కొగ్గియు నింద్రియ నిరోధమునకై ప్రయోగింపఁబడుటవలన చలనాత్మకమైన యింద్రియము, స్ఖలనత్వము వహించి శరీరమునకు గొప్పకీడు నాపాదించును. ఇదియుంగాక ప్రస్తుత కాలమునం దొకానొక వ్యాధిరూపకముచునట్టిదియును బ్రహ్మచర్య విహీన మగునదియునగు పరవిద్యావలంబనము శరీరమునకుఁ గాక నెక్కించినందున విద్యార్థులలో నెందరెందఱికో స్వప్నస్ఖలనవ్యాధియు

నాత్మస్ఖలనవ్యాధియు దుర్మార్గసంచారవ్యాధియుఁ దెచ్చిపెట్టుచున్నట్లు మన మెఱుంగుదుము. కావుననే గవర్నమెంటువారు మునుపటివలెగాక పాఠశాలలందిపుడు వైద్యపరీక్ష (Medical inspection) ను నిర్ణయించి యున్నారు. దేశము వేడి, చదువు వేడి, వయసు వేడి, యీత్రేతాగ్నుల మధ్య విద్యార్థులు కొందరు స్వప్నస్ఖలనాదులతో తులదూగునప్పుడు డాక్టర్లు తత్పరిహారార్థమై సంభోగాదులనే ఔషధప్రతిక్రియక్రింద నిరూపించుటగూడ గన్పట్టుచున్నది. దీనికి కారణమొకటికలదు. వీర్యమును నిరోధించినయెడల నది మూత్రముద్వారా పోవుట తటస్థించును. క్రమరహితమగు బ్రహ్మచర్య మవలంబించుకొందఱకు మూత్రము నందు వీర్యము కరగియుండుట గుర్తింపబడినది. కావున క్రమపద్ధతులమీాద నింద్రియ నిగ్రహము నెఱుంగక యడ్డగోలుగా నింద్రియముల నిరోధించు యువకులకు దేహము క్షీణించుట తటస్థించును దానంజేసి 25 యేండ్లవఱకు బాలురనుంచిన యెడల దేశము వేడి, చదువు వేడి, వయసు వేడి, వీర్యము వేడిఁగలసి శరీరము లతిగా మేహించి బుగిలి రాలిపోవుట తటస్థింపదా. పూర్వమందు మనవారు 40 యేండ్లవఱకునుఁ బెండ్లియాడకుండ బ్రహ్మచర్యము నడుపలేదా యని నన్ను దెప్పెదరు కాబోలు- అయ్యా ఆనాటివిద్యార్థులు సార్థకతవహించినట్టి సారస బ్రహ్మచారులు. ఈనాటివిద్యార్థులు సార్థకత దహించినట్టి నీరస బ్రహ్మచారులు. వీరికి త్వరలో వివాహమొనరింపని యెడల సంఘమునకు మహావిప్లవము సంభవించి మనజాతి దుర్గతుల మునింగి క్షీణించి నామమాత్రావశిష్టము కాగలదు.

6. అతిలోలతాదోషము.

బాల్యవివాహములవల్ల దంపతులకు నపరిమితమగు కామోద్రేకము కలిగి యతిలోలురై దేహబలసంపదలను గోల్పోయి చెడెదరని కాయికసిద్ధాంతులు "25 యేండ్లతర్కము" వల్లప్రకటించు సారాంశములలో నొకటియై యున్నది.

ఈదృశంబగు లోలతానర్థకత్వము కాముని వ్యవహారములందే గాక తదితరములగు నే వ్యవహారమునందైనను స్పష్టముగా మఱింత

స్పష్టముగా గనంబడుచుండుటలేదా. "అతిసర్వత్ర వర్జయేత్" యని పెద్దలమాట ధిక్కరించి యతిలోలుపులైనవారి కేనాడైన ననర్థకము వాటిల్లక మానునా? – వేయేల కామతంత్రములో నతిలోలత నటుండ )చ్చి కేవలము భోజన తంత్రమును గమనించుడి. అలవిమెఱుంగక ొకసంతర్పణయందు పందెము వేసికొని తినివచ్చి వెంటనే మంచమెక్కి మరణించినవారి నేనెఱుంగుదును. అంతమాత్రమున మితాహారము )ంద్యమా! దానంజేసి భోజనవ్యవహారమునే నిషేధింపఁజూచు టేమి )తియగును?

ఈవిషయము లటుండనిచ్చినను బాల్యదంపతుల నొసటనే మతిలోలత వ్రాయబడెనా, ఇట్టిలోలత్వము 25 యేండ్లవఱకుఁ ట్టిపెట్టియుంచిన దంపతుల నొకేదభాగా విడిచి వైచిన యెడల వారికి మాత్ర మతిలోలత్వము మఱెంతసహజమేల కాకపోవచ్చును– వారికే వేయిమడుంగులతిలోలత జనించుట కవకాశములు చాలకలవు– మబ్బు )డిచినయెండ వేడి– చుట్టివిడిచిన చాపదాడి" నెవ్వఱెరుంగరు? దానం జేసి యతిలోలత్వము మనబుద్ధులలో ఆవరణ, అనావరణశక్తులలోలనే 'లదుగాని విలంబితవివాహములలో (Late marriages) తక్కువ య సచుబాల్యవివాహములలో నెక్కువయగుట కన్పట్టదు. దీనికిసరియైన మార్గము సమిష్టికుటుంబసంపన్నతయే సుమీ (Joint family System) మాతాపితరులస్వాధీనములోనున్న బాల్యదంపతులు చక్కనికట్టు ాటులతో సుఖింపఁగలరు. అదుపాజ్ఞలను విడిచినస్థితిలో నున్నవారి 'తిలోలత్వమున కేమి కొఱఁత? కావున బాల్యవివాహము లతిలోలతకు ాధనములగునను తర్కము ప్రాయికముగా నున్నత్తలక్షణ తర్కవే మగుచున్నది.

## (1) శక్తివ్యయము (waste of energy).

వర్ధమానదశయందు శరీరమొకప్రక్కనుండి పెరిగి యభివృద్ధి ొంచుచుండగా తదభివృద్ధిని భంగపఱుచు సంభోగాదు లింకొకవైపు ంండి బలక్షీణమును సంపాదించుననియు, నంతమాత్రమున శరీరవ

వర్ధమాన ఫలితముల నెఱుంగక యే వెనుకబడి త్వరగా రాలిపోవునని యుఁ గూడ వీరిసిద్ధాంతము. శక్తి (Energy) మనమేపని సేయుచున్నను వ్యయమగుచుండును (Energy Spent). మేమిదివఱకే వ్రాసినరీతి నను సరించి యూర్ధ్వ రేతస్కులగు మహానుభావులకుఁగాక యితరులకుసం సార సుఖము మలమూత్ర విసర్జనతోఁ గొంత కొంతతుల్యమని వ్రాసియుం టిమి. దానంజేసి యిట్టిపనియందు శక్తివ్యయముండునా యని సందే హము. అట్లయినచో బహుళసంతానోత్పాదన మొనర్చిన మన తల్లులు తండ్రులు మన తాతలునూర్ల కొలది సంవత్సరములెట్లు బ్రదుకఁ గలిగిరి? మాతాతగారు మూడుపెండ్లిండ్లుచేసికొని 95 యేండ్లు జీవించి నాడు. బ్రహ్మచర్యరహితమగు విద్యావిధానములందు తొప్పదోఁగుచు నిజమైనయపరాధ స్థానమెఱుంగజాలక (Weakspot) బాల్య వివాహ ముల నిందించిన లాభమేమి?

శక్తి వ్యయము (Energy spent) రెండువిధములు. మనమేపని సేయుచున్నను గూడ శక్తివ్యయమగును. పనిసేయుచున్నప్పుడు నడ చుచున్నప్పుడు వ్యయమగు శక్తి (Energy of motion) చలశక్తి కదల కుండ నొకచోటఁ గూర్చున్నప్పుడు నిద్రపోవునప్పుడు వ్యయమగు శక్తి యచల శక్తి (Energy of position) ఉభయ విధములననగా నూరక కూర్చున్నప్పుడును, పనిసేయునప్పుడును గూడ నేకవిధముగానే వ్యయమగుననియు. మొదటిది చలశక్తివ్యయమనియు, రెండవది యచలశక్తివ్యయమనియు. శాస్త్రవేత్తలు నిర్ణయించుచున్నారు. చదువరులారా! సంభోగమువల్ల శక్తివ్యయమగునేని వ్యాయామా దులయందు మాత్రము శక్తి వ్యయములేదా?

From a parity of reasoning such as is applied in this case it would follow that all movements and exercises are injureous, and we should remain motionless during the period of over growth.

*The marriage question, Page 12.*

(ఈ విషయములో ప్రకటించబడిన తర్కములను గమనింపగా శరీరముసుగద లించుట, వ్యాయామము చేయుట మొదలగు పనులుఁగూడ అపాయ కరములని పర్య

వసానము తేలుచున్నది. అందువల్ల 25 యేండ్లవఱకు కదలకుండ యుండవలయును.
మ్యారేజి కొశ్చెన్)

చదువరులారా! ప్రపంచక సృష్టిలో నిట్టి నిర్బంధము కనుపించుటలేనే లేదు. ఈశక్తివ్యయసిద్ధాంతము హాస్యాస్పదముగాగను పట్టుచున్నది. మానవులాచరించు కార్యములలో ధర్మాధర్మతత్పరత సందిగ్ధమయ్యెనేని యా పరమేశ్వరునిచే నడిపించఁబడుచున్న సృష్టిక్రమమునం దా సమానధర్మము లెట్లు నడిపించఁబడుచున్నవో మనము ఋజువు చూచుకొందుమేని యీసందేహము నివృత్తియయి కార్యాకార్యనిర్ణయము తప్పక కాగలదు.

తే॥ గీ॥ జనులకున్ న్యాయపునునేర్పఁజాలు సృష్టి
రచన వ్రాయనిధర్మశాస్త్రంబు కాదె.

కావున వ్రాయని ధర్మశాస్త్రమగు సృష్టిరచనలోని (Nature's unwritten code of Law) స్థితిగతుల విచారింతము.

జంతువులకు వృక్షంబులకుఁగూడ నిట్టి వర్ధమానదశ కలదు. అవియు చిన్నవిగాఁబుట్టి పెరుగుచునే కొంతకాలము వరకుండును గదా-జంతువులలో జాలవరకు తాముపూర్తిగాఁ బెఱుగక మునుపే సంతానమును బడయుచున్నవి. ఇట్టి నిదర్శనములు జంతువుల ప్రపంచకములో ననేకములుకలవు. సంతానోత్పాదకమయిన పిమ్మటఁగూడ జంతువుల శరీరములు పెరుగుచునేయుండుటను మనము చూచుచునే యున్నాము. ఇంక చెట్లలోఁ జూచితిరా. చెట్టులు పూర్తిగా కొతాపుల కొమ్మవఱకు నెక్కి మిన్నంటక పూర్వమే యనగా వర్ధమాన దశపూర్తి కాక మునుపే పుష్ప ఫలోత్పాదనశక్తి నలవఱుచుకొని ప్రతిసంవత్సరము కాపుకాసి పూతపూసి పండ్లనుఁదాలిచి తత్ఫలంబుల మానవుల పొట్టనఁబెట్టి నీళ్లుపోసియు దామేకొఱంత వహించి వర్ధమాన దశకు వెనుకఁబడిపోయెను?

ఉ॥ ఎండకువానకోర్చి యెటులేనివసంతము డాసి పూతమై
నిండుగఁదాల్చి పిందెలగడించి ఫలంబులఁజేసి మారుతా

ఖండత కోహటించి తమ కాయమువంచి భరించిచూతముల్
కండలుమెక్కు మానవులకై తమజీవము ధారవోసి బ్ర
హ్మాండమునంటు నట్లు నభమందునఁదూలుచు వృద్ధినెందవే

ఈసృష్టిరచనయందుఁగనుపడని లోటు మానవులకు మాత్ర మేమి కానవచ్చెను?

No such relation, as is assumed to exist between growth and reproduction is to be seen any where in Nature.

*The marriage question, Page 13.*

The researches of the celebrated German biologist Dr. Wies maun go to show that the reproductive cells are independant of the somatic cells which build up the body. Page 14.

(వర్ధమాన దశకును సంతానోత్పాదన దశకును గల్పింపబడు యీసంబంధము ప్రకృతిలో నెచ్చటఁగూడఁ గానఁబడదు. (మారేజికొశ్చెన్ పుట ౧౩)

జర్మనీదేశములోని సుప్రసిద్ధ జీవశాస్త్రి వేత్తయగు డాక్ట వీస్మన్ దొరగారు సంతానోత్పాదనహేతువులగు నాళములకును శరీరవృద్ధి కారకములగు నాళములకు నేమాత్రము సంబంధము లేదనియు వేటికవి స్వతంత్రముగా పనిచేయుననియు ప్రకటించి యున్నారు.) డిటో. ౧౪ వ పుట.

ఇట్టిసందర్భములో మన సంస్కర్తలు విద్యార్థులలో నష్టాంగ సిద్ధులల వరచదలంచినట్లు కుతర్కముల నేర్పఁబుచుకొని తుదకు వారిలో నష్టాంగమును సిద్ధింప నాపాదించుచున్నారు. ఇట్టి శక్తివ్యయసిద్ధాంతములు, వెట్టివెట్టితర్కములు మహాయోగపథమునందున్న పరమహంసలకుంగూడఁదగియుండవే. సంసారాంధకారములోబడినవారి కేమి చెల్లును? వేయేల శక్తివ్యయము బోధించువారు మానవులకు నుచ్ఛ్వాస నిశ్వాస జనితములగు హంసలవ్యయ మేల బోధచేయరు? ఎటేఁగి యెటేఁగి తత్పరిహార మేమియు సంకల్పించ రేమిహేతువోగాని జాతి విధ్వంసమునుగావించు విలంబితవివాహములు క్షేమకరములని బోధించుట మాత్రము విపరీతముగా గన్పట్టుచున్నది. ఇదియంతయు కలికాల మహిమ.

## సంతాన బలతర్కఖండనము II.

ఈసిద్ధాంతము నింతకుమునుపే విపులముగా "బుద్ధిబలము"

"దేహబలము" లను శీర్షికలక్రింద ప్రథమాధ్యాయములో చర్చించి ఖండించియుంటిమి. ఇంతవఱకు మనగతించినపెద్ద లందఱుంగూడ బాల్యవివాహితులకుఁ బుట్టినవారే సుమీ! రుష్యా జపాను యుద్ధములో గెల్చిన జపానుయోధులందఱు బాల్యవివాహితులకుఁ బుట్టినవారే కదా. వేయేల మే మిదివరకుఁ జూపిన నిదర్శనములు చాలవేని వేఱొక్కటి చూపెదము.

ఇంగ్లండుదేశమునందు వీరాగ్రేసరుండై యసమానవిఖ్యాతిగన్న యెడ్వర్డు (Edward the Black Prince of England) అను యింగ్లండు "నల్ల యువరాజు" తనతండ్రియైన మూడవఎడ్వర్డు(Edward III)నకు 18-వ యేఁటనే పుట్టెను! వీనికేమిబలము కొరతపడినది. ఇంతియగాక టర్కోమానులు, అబిసీనియనులు, చైనావారు, రుష్యాకాపులు-కాఫీర్లు, ఆఫ్ఘనుకూలీలు, న్యూజీలాండులోని మారీలు వీరందఱునుగూడ బాల్యవివాహములవల్ల నేవిధమయిన కొరతగన్నవారు గాక బలవంతులై యుండలేదా. దీనివిషయమై సందేహమున్నయెడల "History of Human marriages" by "Westermark" మానవవివాహచరిత్రము-వెస్టుమార్కు

"Evolution of marriage" by "Laterneon" వివాహపరిణామము—లటర్నియన్" అనువారు వ్రాసిన పుస్తకములను చదివిన యెడల పూర్తిగా సంశయనివృత్తి కాఁగలదు.

పుట్టినపిల్లలు బలహీనులగుట కనేకకారణము లున్నవనియు, బాల్యవివాహము లిట్టియనర్థములకుఁ గారణములుకావనియు, 12, 13 యేండ్ల తల్లులకుఁ బుట్టినపిల్ల లెంతో బలవంతులైయుండిరనియు మే మిదివఱకే నిరూపించియుంటిమి. ఇయ్యది ఏమియు తెలియని ప్రజలను మోసముచేయుటకు సంస్కర్తలు సృష్టించిన తప్పుడుసిద్ధాంత మని ధ్రువమగుచున్నది.

ఇంతియగాక శిశుమరణములును మాతృమరణములును ఇందువల్ల వృద్ధియగుచున్నవను సిద్ధాంతము నిదివఱకే కొంత ఖండించి విడిచితిని-మఱికొన్నిసంగతుల నిరూపించి ఖండించెదను.

ఈతర్కమును ప్రకటింపఁగోరువారు బాల్యవివాహము జరుగుచున్న దేశములకు, జరుగని దేశములకు నేవిధమైన వ్యత్యాసమునైనను గనుపరచనక్కరలేదా? 100కి 56 బాల్యవివాహములు జరుగు దర్భంగ దేశములో శిశుమరణములు 13 గానుండి రుష్యా హంగేరీలో యిబ్బడిగానుండుటకు హేతు వేమిచెప్పగలరు? పోనిండు మన దేశములోని స్థితిగతులనే యాలోచింతము.

కలకత్తానగరములో గల వార్డు లన్నిటిలో శిశుమరణములు బహుజాస్తీగానున్నవార్డులు 12, 16, 17 వార్డులు. ఈవార్డులలో శిశుమరణములు నూటికి 43 (!!!) అత్యద్భుతము. ఈవార్డులలోని స్త్రీలను విభజించిచూతము.

| జాతులు | 12 వార్డు | 16 వార్డు | 17 వార్డు |
|---|---|---|---|
| క్రిస్టియనులు | 479 | 574 | 471 |
| హిందువులు | 39 | 189 | 80 |
| మహామ్మదీయులు | 10 | 38 | 31 |
| బౌద్ధులు | 10 | 1 | 1 |
| పారశీకులు | 9 | — | 1 |
| జ్యూజాతులు | 64 | 13 | 5 |
| బ్రహ్మసామాజికులు | — | — | 3 |
| కంపృ్యానిపనులు | 15 | — | — |
| మొత్తం | 626 | 815 | 592 |

ఇందు బాల్యవివాహములు సేయువారిసంఖ్య నూటికి 18 మాత్రమే. మిగతా 82 ప్రౌఢావివాహములను జేసుకొనుజాతులే గదా. ఇక్కడ 100కి 43 శిశుమరణము లుండనేల? ఇయ్యది పాశ్చాత్యడాక్టర్లకే వింతగదోచినందున డాక్టరు పియర్సు (Dr. Pearce) విమర్శించి కలకత్తానగరములో హిందూవార్డులలో శిశుమరణములలో సగమునకు సగముప్రజలు పరిశుభ్రత నెఱుంగకుండుటచే తటస్థించుచున్నట్లు నిర్ణయించినాఁడు కాని 12,16, 17 వార్డులలో నున్నది

యూరోపియనులే. కాన వారు ప్రాయికముగా పరిశుభ్రముగానే యుందురుగాన వారివార్డులలో చావు లెక్కువయగుటకు వేఱే కారణముల వెదకసాగిరి. కాని ప్రౌఢావివాహములే కారణములని మేము చెప్పక తప్పదు.

These insanitary conditions account for more than 18·5 of the total number of deaths of children below 1 year. If this is the state of things in Calcutta, how much of the infantile mortality in the moffusil is due to insanitary conditions of child birth. This explains to a very great extent the heavy mortality in India.

*The marriage question, Page 20.*

సంవత్సరంలోపు పిల్లలలో నూటికి 18 మంది యపరిశుభ్రతవల్లనే మరణించినట్లు తేలుచున్నది. కలకత్తావంటి పట్టణమునందే యిట్లుండగా బయటియూళ్లగతి యడుగవలయునా? హిందూదేశములోని శిశుమరణాధిక్యమున కిదియేకారణము.

అసంఖ్యాకములగు శిశుమరణములకు దేశములోఁ దాండవమాడుచున్న దారిద్ర్యము, అశుభ్రత, మొదలగునవి కారణములగుచుండ నీదోషమును దెచ్చి బాల్యవివాహముల కంటగట్టించుట కేవలము దుస్సాహసము, దుర్మార్గము.

ఇట్టి సిద్ధాంతములన్నియు నపసిద్ధాంతములనియు నిట్టి హాస్యాస్పదములగు కుంటితర్కములఁ బ్రకటించియే యీచట్టమును మనకు మన సంస్కర్త లంటగట్టిరనియుఁ దేలుచున్నది. ఈ రాద్ధాంతములను మన సంస్కర్తలు పాశ్చాత్త్యులనుండి నేర్చుకొన్నారు. ఇంగ్లీషువిద్య మనవారికి నేర్పిన దీలాటి యసంగతసిద్ధాంతములనే. ఈక్రిందఁ గనుపరచబడిన ఒకానొక పాశ్చాత్త్యవిమర్శకుని వాక్యమును పరిశీలించుఁడు:—

The modern world is full of false ideas, crystalized into axioms. It is these conglomerations of errors which more than anything else, frustrate every attempt to reach a satisfactory solution of the problem of the modern girl and her relation to society.

*Dr. Meyrick Boothe in "Woman and Society"*

ప్రస్తుతపు ప్రపంచమతయు నెచ్చటఁజూచినను శుష్కరాద్ధాంతములతో పరిపూర్ణమై కన్పట్టుచున్నది. ఈతప్పుడుతడకలు, ఈకల్పనాగర్గంపలు [illegible]గట్టి

ఘనీభవించి గొప్ప ధర్మపన్నములై యాఁడుపిల్లలయొక్క ముందుజీవితమును, సంఘ సంబంధమును చక్కగా నిర్ధారణపరచగోరు మనప్రయత్నము లన్నిటిని నేలకును గోలకును బట్టించుచున్నవి. వేఱొండు కారణము లింకేమియులేవు.

డాక్టరు మెరిక్‌బూత్.

చూచితిరా! ఆఁడుపిల్లలను సంఘమును జెఱుచుట కీపాడుసిద్ధాంతములే కారణములగుచున్నట్లు పాశ్చాత్యపండితులు సైతము చింతిల్లుచుండ మన సంస్కర్తల కాచదువులే కూడైనవి. ఈచదువులు మన యింట వంట జీర్ణించినవి. ఇయ్యది ఆంగ్లేయవిద్యాబలమని పలువు రేకగ్రీవముగా చాటించియున్నారు. వేయేల ఆంగ్లవాసన యెక్కడెక్కడనుండునో యక్కడ వివాహాపు కట్టుబాట్లుండజాలవు. ఇది నేనే యను మాటగాదు. ఇంగ్లీషువారుగూడ నట్లే తలంచుచున్నారు. ఆంగ్లేయ చదువు లలవడిన యమెరికాగతి యేమయ్యెను?

ఇంగ్లండులోని యక్రమసంతానములు

| సంవత్సరం | మొత్తము వివాహములసంఖ్య. | అక్రమసంతానము సంఖ్య. |
|---|---|---|
| 1922 | 299,524 | 34,138 |
| 1923 | 292,408 | 31,522 |
| 1927 | 308,370 | 28,454 |
| 1928 | 302,870 | 29,071 |

ఇంగ్లండులోగాక యితరదేశములలోనియక్రమసంతానము జాబితా యిదివఱకే కనుపరచితిని. ఇది దుర్గతికాదా?

సంస్కర్తలు "ఇంగ్లీషుచదువేమిచేస్తుంది మనము మంచివాళ్లమయితే చాలదా" యనుచు నన్ను దెప్పెదరుకాబోలు వినుఁడు.

"What is happening to the domestic life of the Anglo—Saxon race? It is the same tale wherever the English tongue is spoken—More hotels, fewer homes,—More divorces, fewer children.

*Dr. Meyrick Boohe in his "Woman and Society"*

" ఆంగ్లేయజాతిలో సాంసారికబంధముగతి యేమయ్యెనో యెఱుంగుదువా? ఇంగ్లీషుభాష మాట్లాడుకొను ప్రతిదేశమునందుగూడ నిట్టిగాథలే, ఆగాథలేవియనగా,

తే॥ గీ॥ తిన్నఁగాఁ బెండ్లి వేడుకల్ సన్నగిలుట
పూటకూలిబజారింపు దీటుకొనుట
ఆల్మగల తెగఁదెంపులు నతిశయిలుట
అమ్మలక్కల సంతాన మల్పమగుట.

వహావా! ఈదశ మనకుగూడఁ గట్టిపెట్టఁదలంచికాదా యిట్టిచట్టములను సృష్టించుచున్నారు.

చదువరులారా! మనకు కలికాలదురాగతములలో నేఁటికి సంప్రాప్తించిన చట్టమువల్ల ముందు మనగతులేమిగావలెనో యెవ్వరెఱుంగఁగలరు? పరదేశభాషలు మఱగినచో నిట్లుచెడి యధోలోకము పాలగుదుమని కాబోలు, పంచతంత్రములోను, సుభాషితగ్రంథములందును,

"నవదేత్ యావనీం భాషాం ప్రాణైః కంఠగతైరపి."—

తే॥ గీ। గొంతులో నూర్పులుండిన యంతవఱకు
యవనభాష నెవ్వండు మాట్లాడఁదగదు.

అని బోధగావించియున్నాఁడు. ధర్మశాస్త్రము లక్కఱలేదనువారికెవరు సెప్పగలరు? త్రికాలవేత్తలు, దేశహితైషులు, అనూయారహితులునగు మహర్షులు భావిదుర్దశ నెఱింగి బోధించలేదా? ఇప్పటి మన సంస్కర్తలు బ్రాహ్మణాదిజాతుల నధోలోకములకుఁ ద్రోయుటకు లోలోపల ననేక దురుద్దేశములతో నిర్మించిన యీ యధర్మచట్టము తనయంత సంహరించుకొనుఁగాక.

శాంతం పాపమ్.



## II విద్యాక్షేమతర్కము.

బాల్యవివాహములు విద్యాభంగ మొనర్చుననియు, అట్టిహేతువువల్ల బాలురకు చదువు పూర్తియగునంతవఱకు వివాహ మొనర్చ గూడదనియు వీరు తర్కించుచున్నారు. దీనికి తగినట్టు లోకులందు "వివాహో విద్యానాశాయ" యనుసామెతగూడ కొందఱు పామర జనులచేఁ బ్రాయికముగా వ్యవహరింపఁబడుచున్నది. ఈ సామెతపూర్వ కాల పరిస్థితుల ననుసరించి చూచినచో వాస్తవమగునేమో. ఏలయన, పూర్వకాలఁపుచదువులు బ్రహ్మచర్యప్రధాన మగుటంజేసి వివాహము వాటికిఁ గొంతనిరోధకము గావచ్చునేగాని యీనాఁటి చదువులకు అనఁగా బ్రహ్మచర్యవాసన లేశమైన నెఱుంగని ప్రస్తుతాంగ్లేయ విద్యావిధానముల కా "వివాహోవిద్యానాశాయ" యను సామెత యేమాత్రమేని వర్తింపదు.

నిజముగా వివాహము విద్యకు భంగముకలుగఁజేయునాయను విషయము నేసంఘసంస్కర్తగాని నిదర్శన పూర్వకముగా ఋజువు సేయఁగలిగిరా? ఏమైనా గణితీలెక్కలు ఆధారముచేయబడినవా? వివాహము చేసుకొనకుండ చదువుకొను విద్యార్థులు వివాహములు చేసుకొని చదువుకొను విద్యార్థులకంటె వెనుకఁబడినట్లేమైన నుదాహరణములుగలవా? ఇట్టియాధారములగుపరచనంతవరకుఁ గూడ వీరి తర్కములు కేవల దురూహా కల్పితములనియే త్రోసివేయక తప్పదు.

I find some of the most brilliant students of our (Calcutta) University were married long before they finished their scholastic education. I can name many married students who stood first in the University I will only mention the names of Dr. Sir Guru Doss Banerjee, Babu Sarada Charan Mitra, Professor Bepin Behari Gupta, Babu Hirendra Nath Dutt, Prof. Ramendra Sundar Trivedi, Prof. Lalit Kumara Banerjee etc, — — — Their marriages were no hindrance to their scholastic education and hey left their unmarried competitors behind.

*The marriage question P. 22,*

మాకలకత్తా యూనివర్సిటీలో మిక్కిలి ప్రతిభాశాలులైనట్టి విద్యార్థులు ెందరు చదువు పూర్తి గాకపూర్వమే పెండ్లి చేసుకొన్న వారేసుమీ. పెండ్లి చేసుకొని ాల్యులలోఁ జదువుకొని యూనివర్సిటీ పరీక్షలలో ఫస్టుక్లాసులో ప్యాసయిన ద్యార్థుల పేర్లెన్నియో నేను చెప్పగలను. సర్ గురుదాస్ బెనర్జీ, బాబుశారదాచరణ ిత్ర, ప్రొఫెసర్ బిపిన్‌బెహారీగుప్త, బాబుహీరేంద్ర నాథదత్త, ప్రొఫెసర్ రమేం సుందరత్రివేది, ప్రొఫెసర్ లలితాకుమార బెనర్జి—మొదలగువారెందరెందరో కలరు. రు పెండ్లాడుట వీరి చదువుల కేమాత్రము ప్రతిబంధకము గాకపోగా పెండ్లి చేసు ొన కుండా చదువుకొను సాటివిద్యార్థులను వెనుకకుఁద్రోసి ప్యాసుకాఁగలిగిరి.

మ్యారేజి క్రొశ్చెన్.

ఈ పైనుదాహరించిన విషయములు గమనించినచో వివాహము విద్యా ప్రతిబంధకమగునని వాదించువారి తర్కము కేవలము దురూహాకల్పి మని మనకు స్ఫురింపక తప్పదు.

ఇంకొక విషయము గమనింపవలసియున్నది— కామమనునది మానవులకు దినదిన ప్రవర్ధమానమగు వికారమేగాని అట్టె ఆకసము ండి జారి గభాలున మానవులపై దూకునట్టివస్తువు కాదు. బాలురకు సమము పెండ్లి సేయకపోయినంతమాత్రముచేతనె వారిలో సకాలమున దయింపవలసిన కామవికారము నడగింపగలమనుట వెఱ్ఱితనము. ామము తానెప్పుడుదయించవలెనో యప్పటికి ఉదయించితీరు ను. అట్టికామోదయము గల్గురోజులలోనే విద్యార్థుల మానసముల ొక్కచోట కట్టియుంచినచో వారియూహ లచ్చటచ్చటఁ దిమ్మిరి వెడిపోకుండ స్థావరముగా నొక్కయెడనే కట్టువడి యుండును. లేకున్న పాశ్చాత్యదేశములలో పనిపాటలులేక దారినిబోవు ప్రతి యువతి వెంట పిచ్చివిలిపియల్లాడు కోడెకాండ్రవలె సంచరింపరా? ఇయ్యది బాలురకు సకాలములో పెండ్లిసేయక విడుచుటవల్ల వచ్చుఫలితము గాదా? సంఘసంస్కర్తలు కన్నులు మూసుకొన్నంతమాత్రముననే పోయె. ఈ దుస్థితి గమనింప నక్కరలేదా? ఈ యభిప్రాయమునే నాలమంది ప్రకటించుచున్నారు.

By marriage, a steadiness of aims and conduct is imported into the character of our young men, which prevents them from wasting their time both in imagination and in reality round the fascinating companionship of every pretty young girl whom they meet.

*Ibid Page* 23.

పెండ్లి చేసుకొన్నయెడల విద్యార్థుల మనస్సుల కొకానొక స్థైర్యము, ప్రవర్తన యందు నిలుకడ వారికి స్వభావగుణములై వర్ధిలగలవు. ఈనిలుకడవల్లనే వారితలం పులు తారుమారుగాఁ ద్రిమ్మరకుండ, తద్ద్వారావృథాగా కాలయాపనము గావింప కుండ, కంటఁబడ్డ ప్రతిచక్కని పిల్లమీదను మనసుపోకుండ వారిని కాపాడగలిగి యున్నది.

అందువల్ల బాలురకు తగినయీడురాగానే వివాహమొనరించుట కడుం గడు శ్రేయస్కరమని నిర్వివాదముగాఁ దేలుచున్నది. డాక్టరు ఆపట్ సింక్లరు దొరగారు పిల్లలకుఁ బెండ్లిసేయనిదే బడికిపంపకూడదనియు, పెండ్లి సేయనంతమాత్రముననే వారిచదువు మఱింత బాగాజరుగు ననుట సర్వాబద్ధమనియు, తదుపరి యవివాహితజనులందు తందనాలు తైతక్కలు పెచ్చుపెరిగి విద్యసాగనీయదనియుగూడఁ బ్రకటించిరి. వీరి వాక్యము మున్ముందు వ్రాసితిని.

## 2. శిశుపోషణ.

అది యటుండనిచ్చి చిన్నవయసులోనున్న దంపతులకు శిశు పోషణయందుఁదగుసామర్థ్యముండుటదుర్లభమనియు, నందువల్ల బాల్య వివాహములు విద్యార్థుల కంతకంతె వేయిమడుంగు లనర్థకహేతువు లనియుఁగూడ నొకతర్కముకలదు. కాని మనదేశమునందు బాల్య వివాహములవల్ల మనకేర్పడిన సమష్టికుటుంబపద్ధతు లీదురూహకు బదులు చెప్పగలవు. పసిపిల్లలను పోషించుబాధ్యతలు బాలదంపతుల యందే విడిచిపెట్టక సమష్టికుటుంబములందుండు పెద్దవారెవరో యొకరు తోడ్పడుచుండుట మనము కన్నులార చూచుచుండలేదా? కావున నీతర్కము విశ్వసనీయము కానేకాదు.

## ఆర్థిక పుష్టితర్కము.

ఇయ్యది యొక విపరీత సిద్ధాంతము. మానవునకు భార్యాపిల్లలను బోషించుశక్తి వచ్చువఱకును బెండ్లాడకూడదని వీరు సిద్ధాంతము చేయుచున్నారు. సంసారపుజంజాటము మానవులలోని ధైర్యసారమును పీల్చివేయునని వీరియభిప్రాయము. ఇచ్చటఁగూడ మనసమష్టికుటుంబపద్ధతులే చక్కని సంతారణోపాయములు. ఇట్లు సంసారపోషణశక్తి లేనిదే పెండ్లాడి తదుపరి సంసారభారముచే గ్రుంగిపోయి జీవితమునందు నిష్ఫలులై జనులు చెడిపోవుదురట. మానవుం డెవ్వండేని యీపై చెప్పిన విధముగా జెడినట్లయితే దానికి ప్రధాన హేతువు అతనిలోపలగల సోమరితనము, అశక్తి మొదలగు దుర్గుణములే కారణములుగాని పెండ్లి మాత్రమే హేతువుకానేరదు. ఏలయన పెండ్లిచేసుకొనకుండ తిరుగువానికి జవాబుదారితక్కువ, బాధ్యతలు తక్కువ. ఆ! మనకేమి–ఒక్కనికేమి కావలెనని సోమరియై కూర్చుండును. అట్లుగాక పెండ్లి చేసుకొన్నవాడు పెండ్లము పిల్లలకు లేకపోవునే యను వగపుతో కడుపు కాలు గట్టుకొని యెక్కడనో స్వయంకృషిసేసి నాల్గుడబ్బులు గడింపవలెనే యను నాతురత కార్యదీక్ష కీతనిం బురికొల్పును. అట్లుగాక పెండ్లి చేసికొనక యొంటరిగా తిరుగు ద్రిమ్మరి ఏవిధముగనో తన కామమును దృప్తిపఱచుకొని సంసారము కాపురమునొల్లక సోమరియై రానురాను తనయొక్క పొట్టకే గడించుకొను శక్తినికూడ గోల్పోయి "రెంటికిం జెడిన రేవడి" భంగి యల్లాడక తప్పదుసుమీ. వేయేల తమపుత్రులు పెడదారులంబడి పొరలాడుటంగని యెందఱు తలిదండ్రులు తమ బాలురకు పెండ్లి చేసివారిని సన్మార్గమునందు బ్రవేశపెట్టుటను మనము చూచుచుండుట లేదు. వేయేల ధర్మపత్నీలక్షణ లక్షితలైన భార్యలు తమతమ భర్తలకర్ధాంగలక్ష్మీ దేవతలనంబడుదురు గదా. అట్టిభార్య సమస్తోపచారములు శుశ్రూష లొనర్చుచుండగనే మానవులకు భార్య గుదిబండవంటిదని తలంచుట పొరపాటు కాదా. ఇంతియెగాక భార్య మానవునకు కార్యదీక్షను నేర్పిసోమరితనమును మాన్పిచక్కని ప్రయోజకునిగా చేయగలదు. భార్యలు గుదిబండలను అభిప్రాయము మన

యాంగ్లవిద్యాపరిచయమువల్లజనించినదురూహయే. పాశ్చాత్యదేశము నందు వివాహము లోకయాత్రావిశ్రాంతిగా భార్యలచే నెన్నఁబడు చున్నది. కాని మనదేశములో వివాహము లోకయాత్రా ప్రారంభ ముగా తలంచబడుచున్నది.

కావుననే పాశ్చాత్యదేశములలోని యువతులు పెండ్లాడగనే సుఖానుభూతికే పాటుపడుచుండ మనస్త్రీరత్నములు భర్తృసేవా పరాయణలై, భర్తకర్ధాంగులై, స్వార్థత్యాగశీలలై గృహకృత్యములందు తదేకదీక్షతో సంచరించుచుందురు. ఇంతియేగాని భార్యలు మనదేశమునం దేయుగములోగూడ భర్తలకు గుదిబండలై వారొనర్చవలసిన కార్యములకు ప్రతికూలలై సంచరించుట కుదాహరణములు లేవు.

రాణా ప్రతాపసింగుతో రాజపుత్రులు ఆరావలీకొండలలో డాగబోవునప్పుడు రాజపుత్రయువతీరత్నము లడ్డుపెట్టిరా? బుద్ధుడు, చైతన్యుడు, రామకృష్ణులు సన్యసించబోవుచో భార్యలడ్డమైవర్తిల్లిరా?

చదువరులారా! రుష్యాజపాన్ యుద్ధములో జయించినజపాన్ వీరులేమి బ్రహ్మచారు లనుకొంటిరా. జపాను కాంతామణులు తమ భర్తలను యుద్ధమునకు బోనీయకుండ నడ్డగించిరా. తమతమ భర్తలకు ధైర్యసాహసముల నూరిపోసి రణరంగమునకు బంపించి యుండ లేదా. ఎచటికోపోనేల, ఖడ్గతిక్కనభార్య యేమిచేసెను. యుద్ధములో పరాజయమంది తిరిగి యింటికివచ్చినభర్తకు

"ముగురాడవారమైతిమి
వగపేటికి జలకమాడ వచ్చినచోటన్ ॥"

అనుచు బోధించి తిరిగి ధైర్యసాహసములను వానియందు చక్కగా బోతపోసి మరల రణరంగమునకు బంపించలేదా! భార్య తమభర్త లొనర్చు కార్యములం దేమాత్రమేని ప్రతిబంధకములై ప్రవర్తిల్లినట్లు నిదర్శనము లేమియు గానరావు. జపాన్ యువతీరత్నము లెంత ధర్మపత్నీ లక్షణ లక్షితలో యట్లే మనదేశపు యువతీమణులుగూడ నిట్టివారేయని యెఱుంగునది. వేయేల కొలది సంవత్సరములక్రిందట మనదేశమునకువచ్చి ఇచటిసంగతి సందర్భములను గాం

చిన పిదప జపాన్ వాస్తవ్యుఁడగు కౌంటుఒకకూరా (Count Okakura) యనునాతఁడు ప్రకటించిన విషయము నెఱుంగవలసియున్నది. All Asia is one:—ఆసియాఖండమంతయు నొక్కటేయని వారుద్ఘోషించుచున్నారు. జపాన్ దేశపు యువతీమణులెట్లో మనవారుగూడ నట్లేయని వారి యభిప్రాయము. చదువరులారా! భర్తలతో సహ అనుగమించుటయే పరమవిధిగాదలంచు మనభార్యలు మన మాచరించు ధర్మార్థకామమోక్ష యత్నములకు విఘ్నకారిణులగుదురనుట గొప్ప పొరపాటు. దానంజేసి పెండ్లాడి భార్యతో కాపురము సేయువాడు కార్యదీక్షలో వెనుకఁబడి చెడిపోవునను తర్కమున కేమాత్రమేని యవకాశము లేనే లేదు. కార్యోద్రేకశూన్యులమై మనయంతట మనమే చతికిలంబడవలసిన దేకాని భార్య మనల కూలద్రోసి కూర్చుండబెట్టజాలదు. ఇంతయేల? దక్షిణఆఫ్రికాలో మనదేశీయులొనర్చిన శాంతిసమరమునకు భార్య లడ్డమైరా? అట్టిదే హైందవనారీమణియొక్క స్వభావలక్షణము. ఈతర్కమింతటితో ముగించి మగవారికి సంసారపోషణకు జాలిన సంపాదనశక్తి యలవడెడివఱకు బెండ్లాడకూడదను సిద్ధాంతమును బరిశీలింతము. ఇయ్యది సకలజనమానసములకు చక్కగా నచ్చియున్నది. స్థూలదృష్టితో చూచినయెడల దీనియందెంతో ప్రయోజనసత్యత్వములుగల్గినట్లు ప్రతివానికి స్ఫురించకతప్పదు. అందువల్లనే సంఘసంస్కర్తలీతర్కముతో కొంతకొంత వారిబోధనలను బలపరుచుకొనగలిగిరి. ప్రస్తుతదేశస్థితి, దేశదరిద్రత, దుర్భిక్షము, నిరుద్యోగత్వము మొదలగు లక్షణములుగూడ నిట్టి తర్కమునకు తోడుపడుచున్నవి. వేయేల ప్రస్తుతకాలగతి ననుసరించిచూచినచో నేనాటికింగూడ మానవునకువివాహార్హతయుదయింపఁజాలదని తేలగలదు. ఏలయన, బి. య్యే. యెం. యె లు ప్యాసుచేసినవారికి మాత్రము వెంటనే సంపాదనశక్తి పుట్టుచున్నదా! లేదు. అట్లయిననిక నేనాటికాతఁడు బెండ్లాడవలెను? సంపాదనశక్తివచ్చువఱకుఁ బెండ్లాడకూడదనుతర్కముప్రస్తుత ప్రపంచపరిస్థితులకుఅనుపయోగకరము. ప్రపంచకము సమస్తసద్గుణసమగ్రత్వచే విలసిల్లుటలేదు. మానవుల జీవితములు తప్పులతడకలుగానున్న యీరోజు

లలో నిట్టి తర్కములు దేశారిష్ట హేతువులుగాక తప్పవు. ఈసిద్ధాంతము పాశ్చాత్యదేశములలో చలామణియగుచున్నదిగాని మనదేశమునందు దీనికి ప్రచారము కడుంగడుస్వల్పము. ఏదినమున కాదినము పొట్ట బుజానం గట్టుకొని జీవించు కూలివాడు సైతము పెండ్లిచేసుకొని భార్యాభర్త లిద్దఱుంగలిసి కూలిచేసుకొనుచు పిల్లల పోషించుకొనుచు జీవయాత్ర గడుపుచుందురేగాని సంసారములు కాపురములన్న జంకి మూలనొదిగి పెండ్లిండ్ల నొల్లక యేవేళ కేదిదొరకిన దానితో పొరలాడి యమెరికాదేశములో వ్యవహరింపబడు సంతోషకరమైన సామెత ప్రకారము Sowing Wild Oats. అడవి బీజముల నాటుచు

స్వేచ్ఛగా సంచరించుటకు నిష్ఠదరిద్రులకైన నీ దేశమునం దిచ్చబోడముట కవకాశ మావంతయును లేదు. కాని విలంబితవివాహములవల్ల నవివాహితలయి యీడేరియున్నకన్నె లింటింట గుంపులుగుంపులుగా నుండునట్టి దుస్థితి యీభరతఖండమునకు ముందుముందు దాపురించి నప్పుడెంతెంతలు దురాగతములు వ్రాసియున్నవో భగవంతునికే ఎఱుక. విలంబితవివాహ ఫలితములను శ్రీయుత బాబు చారుచంద్ర మిత్రగా రెట్లు వర్ణించుచున్నారో చక్కగా బరీక్షించుడు:—

Prostitution and prevalence of venereal diseases are the inevitable consequences of the presence of a large number of adult unmarried men in a society—and a large number of illegitimate children. In order to give you an idea of how appalling these evils are in European countries, I would quote the statistics of illegitimacy in some countries in Europe in 1900 from the Encyclopedia Brittanica.

Out of every 1000 births

| | | |
|---|---|---|
| 150 | are illegitimate in | Bavaria |
| 141 | ,, ,, | Austria |
| 121 | ,, ,, | Portugal |
| 113 | ,, ,, | Sweden |
| 101 | ,, ,, | Denmark |
| 90 | ,, ,, | Germany |
| 88 | ,, ,, | France |
| 80 | ,, ,, | Belgium |

| | | | | |
|---|---|---|---|---|
| 74 | | ,, | ,, | Norway |
| 68 | | ,, | ,, | Scotland |
| 49 | | ,, | ,, | Italy |
| 41 | | ,, | ,, | England |
| 36 | (now 26) | ,, | ,, | Ireland |
| 27 | | ,, | ,, | Russia |

In cities the percentage of illegitimate birth is considerably higher. In Berlin it is as high as 14 per cent. I find in the January number of the Review of Reviews for 1913 that it has gone up to 20 per cent. which means that out of every 5 children born in Berlin, one is illegitimate and this in countries where the people know and use preventive precautions against conception.

*Ibid P.* 24 &. 30

(ఏసంఘమునందైనను యీడువచ్చిన పెండ్లికాని పడుచువారుండిరేని యా సంఘమునందు వ్యభిచారము తజ్జనితములగు చిలిపిరోగములు అనివార్య ఫలితములు. అక్రమసంతానము తదనంతరఫలితము. ఇట్టి దుర్గతులు యూరపియన్ దేశములలో నెంత భయంకరములుగా నున్నవో మీకు తెలియునట్లు చెప్పెదను. 1900 సంవత్సరములో యూరపియన్ దేశములలోగల యక్రమసంతాన బాహుళ్యమును సూచించెదను. ఏన్సైక్లొపీడియా బ్రిటానికాలోని గణితీప్రకారము ప్రతి 1000 జననములలో

| | | |
|---|---|---|
| బవేరియాలోని యక్రమసంతానము | | 150 |
| ఆస్ట్రియా | ,, | 141 |
| పోర్చుగల్ | ,, | 121 |
| స్వీడెను | ,, | 118 |
| డెన్మార్కు | ,, | 101 |
| జర్మని | ,, | 90 |
| ఫ్రాంసు | ,, | 88 |
| బెలిజీయం | ,, | 80 |
| నారువే | ,, | 74 |
| స్కాట్లెండు | ,, | 68 |
| ఇటలీ | ,, | 49 |
| ఇంగ్లండు | ,, | 41 |
| ఐర్లండు | ,, | 26 36ఇపుడు |
| రష్యా | ,, | 27 |

పెద్దనగరములలోనియక్రమసంతానము మరింత యెక్కువగానున్నది. బర్లిన్ పట్టణములో నూటికి 14 మంది యక్రమ సంతానములు. 1913 సం॥ జనవరినెల

లో ప్రకటింపఁబడిన రివ్యూ ఆఫ్ రివ్యూ సెంబరులో యీసంఖ్య నూటికి 20 వఱకును వ్యాపించినట్లు తేలుచున్నది. దీనికర్థమేమనగా బర్లినులో బుట్టినప్రతి శిశుపంచకమునకునొక్కఁడు అక్రమజనితుడు. (తలిదండ్రులు కనిపారవేసిన నిర్భాగ్యడింభకము.) ఇదియంతయును సంతాననివారణోపాయములు ప్రజలు విచ్చలవిడిగా నభ్యసించుచోటనని యెఱుంగవలసియున్నది.

(అనగా నివారణలేక పుట్టవలసినబిడ్డలనందఱను బుట్టనిచ్చినయెడల పాపము సగమునకు సగము నిర్భాగ్యసంతానమే యగునుగాబోలు)

ఇట్టి దుస్థితిని యూరోపుఖండమనుభవించుచుండుట గన్నులార జూచుచుండియు వివాహవయస్సు నింకనింకను దూరముగావించుటేమి విజ్ఞానలక్షణమో మనశాసనకర్తలకే యెఱుకపడవలయును.

అది యట్లుండనిచ్చినను చిలిపిరోగములు యూరోపుదేశములో విలంబిత వివాహములకు సమీప ఫలితములై యెట్లు కొండలుకొండలుగా పెచ్చుపెరిగి పోవుచున్నవో తిలకింపుడు:—

In every 1000 admissions in hospitals

| | | |
|---|---|---|
| 77·4 | are for venereal diseases in | United States |
| 71·0 | ,, | Italy |
| 63·5 | ,, | Austria |
| 43·0 | ,, | France |
| 43·0 | ,, | Russia |
| 27·2 | ,, | Germany |
| 203·6 | ,, | British army (at Home) |
| 438·0 | ,, | British army (in India) |
| 455·0 | ,, | Dutch army (in Dutch Indies) |

*Ibid P.* 30

ఆస్పత్రికివచ్చిన ప్రతివేయిమంది రోగులలో

| | | |
|---|---|---|
| యునైటెడ్ స్టేట్సులో చిలిపి రోగములతో బాధపడువారు. | | 77.4 |
| ఇటలీ. | ,, | 71.0 |
| ఆస్ట్రియా. | ,, | 63.5 |
| ఫ్రాంసులో | ,, | 43.0 |
| రుష్యా. | ,, | 43.0 |
| జర్మనీ. | ,, | 27.2 |

| | | |
|---|---|---|
| ఇంగ్లండులోని బ్రిటీషుసైన్యము | ,, | 203.6 |
| ఇండియాలోని బ్రిటిషుసైన్యము | ,, | 438.0 |
| డచ్చియిండీసులోని డచ్చిసైన్యము | ,, | 455.0 |

ఇట్టిచిలిపి రోగములు విలంబిత వివాహముల ఫలితములు. ఇవి యన్నియు మన దేశమునకుంగూడ దిగుమతి కావలసినగతి యికముందు వ్రాయబడియున్నదికాఁబోలు. లేకున్న విలంబిత వివాహ ఫలితముల నేమానవమాత్రుఁడైన నూహింపనశక్యమై యుండ సంస్కర్తలేల కన్నులు దెరవజాలకుండిరో తెలియదు.

ఇంకొక విషయము గమనించవలసియున్నది. ఆర్థికపుష్టిని బరిగణించినచో ఇంగ్లండులో 20 యేండ్లకుపైబడ్డ మగవారిలో నూటికి 40 మంది పెండ్లియయినవారలే. ఆలెక్కనే ఆధారపరుచుకొని యొకసంసారమునకు రు 40 నెలకు కావలయునను నిర్ణయమువలంబింతుమేని మనదేశములో నూటికి అయిదుగురు మాత్రమే వివాహమున కర్హులగుచున్నారు. మిగతా 95 మంది వీధులలో నల్లాడవలసినదేనా? అప్పటికి యెంతబజారింపులు యెంతచిలిపి రోగములు వృద్ధియగునో మీరే యూహించుకొనుడు. అప్పటికిమన దేశమునందలినారీమణుల గతియేమికావలెనో కొంచెమాలోచించిన మీకేతోచగలదు. మన దేశములో ఆడుపిల్లల కాస్తిలో భాగమున కర్హతలేదు- తలిదండ్రులు గతించినపిమ్మట, సోదరులా యవివాహితలైన యాడుపిల్లల నేమిసేయగలరు? పెండ్లిచేసుకొను మగవారు నూటిలో అయిదుగురయినప్పుడు మిగిలిన 95 మంది కన్నెలకు మగడెచ్చట దొరకగలడు? దానంజేసి ఆర్థికపుష్టితర్కము హాస్యాస్పదముగా దోచక తప్పదు. ఈతర్కము నిజమని నమ్మిన యెడల దానినాచరించిన యెడల దేశమున కనర్థకము రాకతప్పదు. అవివాహితలగు కన్నెలను బజారింపునకు బురికొల్పినవారమగుచున్నాము. ఇయ్యది మనము చేసేతులతో చేసికొన్నమహాపాతక కార్యముకాదా! శారదాబిల్లు ఫలితమిదియేకాదా?

వేఱేల యీతర్కము నింకొకవిధముగా బరిశీలించినచో విలంబిత వివాహములందుగల యనర్థములు మన దరిద్రస్థితిచే వేయిమడుంగులు పెచ్చుపెఱిగి వేధించక తప్పవు. డాక్టరు సర్ డబ్లి. హంటరుదొరగారు మన దేశములో సగటుమనుష్యున కొక్కొక్కనికి నెలకు రు 2-రెండు రూపాయి లాదాయమనుచున్నాడు. లార్డు కర్జన్‌గారు లెక్కలు తిరగజూచి మనుష్యుని కొక్కొక్కనికి రు 2-8-0 అనుచున్నాడు. డిగ్బీ (Digby) నౌరోజి (Nowroji) మొదలగువారు రు 2-8-0 కు. తక్కువయే యని వాదించుచున్నారు. మిక్కిలి భాగ్యవంతములగు సంసారములను నూటికి 10 విడిచిపెట్టినచో నూటికి 90 మంది వివాహము చేసుకొనుటకు చాలినంత ధనపుష్టిలేని వారనియే తేలుచున్నదిగదా. కావున యీసిద్ధాంతము జాతిధ్వంసమునకు గారణము కాగలదు. అట్లయినచో 30 యేండ్లలోపల మనభారతజాతి నశించి నామమాత్రావశిష్టము కాగలదు.

Look at France and at the condition to which she has been reduced by following these economists. Her population which was almost on a par with that of Germany at the time of Franco-German war is now about $\frac{4}{7}$ of that of Germany and the result is that in spite of the most strenuous efforts she cannot bring into the field more than $\frac{3}{4}$ of the army which Germany can. The navy of France has been far outstripped by that of Germany that had practically no navy of her own 40 years ago. Thus France, notwithstanding her enormous wealth which far exceeds that of Germany, notwithstanding the bravery, energy and ingenuity of her sons lives in daily mortal fear of her powerful neighbour. They have now begun to see the folly of their conduct. French politicians are at their wit's end to purge the poison of this false economic doctrine and are now devising all sorts of means to induce people to marry and beget more children by exemption of taxes by increase of pay to the fathers of children, by imposition of taxes on bachelors, by grant of bonus and leave on full pay to mothers during and for a short time after confinement.

ఈ వైరియార్థిక వేత్తల తర్కముల దెగనమ్మి కొని ఫ్రాంసు దేశమెట్టి యధోగతికి వచ్చెనో యిట చెప్పద గమనించి చూడుడు. యుద్ధమునకుముందు సరిసమానముగానున్న ఫ్రాంసు, జర్మనీదేశముల జనాభాలలో, నేఁటికి జర్మనిలో సగ

కు జనాభా కైనను ఫ్రాంసు నోచుకొనలేదు గదా. ఇట్లు ప్రజ క్షీణమైనందున యుద్ధమువచ్చినప్పు డెంతకష్ట పడినను జర్మనీదేశము సంతరించుకొనఁ గలిగిన సైన్యములో నొక ముప్పాతిక భాగమునైనను తాను సమకూర్చుకొన లేక ఫ్రాంసుదేశము కడగండ్లబడ వలసి వచ్చెను.

40 యేండ్ల క్రిందట నౌకాదళ మన్న నెట్లుండునో యెఱుగని జర్మనీదేశమీ నాడు ఫ్రాంసు నౌకా బలమును తల దన్నుచున్నది. ఫ్రెంచి కుమారు లెంతధైర్యశాలులైన నేమి? యెంతశక్తివంతులైన నేమి? ఎంత యుపాయశాలులైన నేమి? ఎంత భాగ్యవంత దేశమైన నేమి? నిరంతరమా సమీప జర్మని రాజ్యము బలసంపదను దలంచుకొన్నప్పుడె వడఁకుచున్నది గదా వారు చేసుకొన్న స్వయంకృతాపరాధమిప్పుడు కనులు తెరచి చూచుకొన్నారు. ఈ ఆర్థిక సిద్ధాంతము దేశమునకు దెచ్చిపెట్టినచేటువల్ల జనించిన విషమస్థితిని బాపుకొన గోరి రాజకీయవేత్తలు పలువిధములైన పన్నాగములనుబన్ని ప్రజల నెట్లయిన పెండ్లిచేసుకొన బురికొల్పి సంతానము గాంచుటకు ప్రోత్సాహముసేయ మొదలిడిరి. వారవలంబించిన యుపాయము లియ్యవి-బిడ్డలుకను వారికి పన్నులులేకుండ చేయుట, జీతము వృద్ధిసేయుట, అవివాహితులగుజనులకు జొట్టు పన్నువేయుట, బిడ్డలుకను తల్లులకు బహుమానముల నొసంగుట-గర్భిణిగానున్న కాలములో ఉచితముగా సెలవులిచ్చుట మొదలగు నుపాయముల నవలంబించిరి.

చదువరులారా! చూచితిరా! ఫ్రెంచి దేశమెంత దుర్దశకు దిగినదో. ఈ వెఱ్ఱి ఆర్థికవేత్తల తత్త్వములను దెగనమ్ముకొని చెడిపోయిన దేశములకు ఫ్రాంసు దేశమే ప్రత్యక్ష నిదర్శనము. నెపోలియన్ రాజ్యముసేయునప్పుడు ఫ్రాంసుదేశములో నొకగృహస్థుడు తనకు బుట్టిన 32 పిల్లలను రాజునకు కానుకగా జదివించెనట. నాడట్టులున్న దేశానికీ నాడు విలంబిత వివాహముల వల్ల గొప్పలగు అనర్థములావహిల్లి జనాభాతగ్గి కృశించి పోవుటం గని తన్నివారణార్థమై యవివాహితులగు వారికి జుట్టుపన్ను విధించి యనేక యగచాట్లుపడి తుదకు ప్రజలను పెండ్లి చేసుకొనుటకు బురికొల్ప దలంచి శాసనములు గావించవలసిన గతిపట్టినది గదా. రేపు మనగతికూడ నింతియే యగును. కాని మనము మనకండ్ల యెదుట విలంబిత వివాహములవల్ల చెడి నాశావశిష్టమగుచున్న యిరుగుపొరుగు దేశములను కన్నులార జూచుకొను

చున్నాము. మనకు బుద్ధి విపరీతములయందె చొరంబడి పిచ్చిచట్టములఁ బెట్టి వివాహ వయస్సును దూరదూరమునకు నెట్టి బలాత్కార శాసనములుపెట్టి చేసేతుల నధోగతి నెత్తికి నంటగట్టుచుండుట ధర్మమా? నీతియా? ఫలకారియా? మీరె యాలోచించుకొందురు గాక.

జాతి యనునది సంఖ్యవల్లనే వృద్ధి కాగలదు. ఈకలికాలమునందు సంఖ్యాబలమే బలముగాని యింకేదియు బలమనిపించుకొనదు. కావుననే "పదుగు రాడుమాట పాటియై ధరఁజెల్లు, నొక్కఁడాడు మాటయక్కఁడంగు" నని చెప్పుకొనుచున్నారు. యుద్ధము నెత్తి మీదికివచ్చి కూర్చున్నప్పుడు ఫ్రాంసు దేశమునకు మెలకువ గలిగి "అయ్యో విలంబిత వివాహములవల్ల బజారింపులు గర్భనివారణలు ప్రబలి దేశములో పుట్టుకలు తక్కువై నిలువబడగల మగవారు చాలక యల్లాడవలసివచ్చెనే" యని వగచి పెండ్లిచేసుకొనని వారిని శిక్షించుట కారంభించుచుండ మనమేమి చేయుచున్నాము? పెండ్లి చేసికొన్నవారికి ఖైదులు జుల్మానాల నంటించుచున్నాము. కట్టా!

"మ॥ కలికాలంబిటు కాలుచున్నదిఁక దిక్కా మొక్కకామే శ్వరీ" యన్నమాట జ్ఞప్తికి వచ్చుచున్నది. పోనిండు, రజస్వలానంతర వివాహములు సర్కారువారు ప్రోత్సహించఁ దలఁచిన యెడల యేదో విధవా వివాహశాసనమువలె "అనుమతి" చట్టమును (Enabling act) నిర్మించిన చాలదా? శిక్షావిధానమున కగత్యమేమి కలదు?

శా॥ ఎన్నెన్నో చెడుగుల్ ఫలించుటలు తా ౯ మే కంటితోఁ జూడ లే
కున్న౯ యూరపియన్లఁబోలఁదగు కో ౯ ర్కుల్ పుట్ట నీచట్టముల్
బన్నంగల్గి రటుండనిమ్ము తొలుదొ ౯ ల్తన్ గొడ్డఁటన్ గొట్టుటా
యన్నప్రాశన కావకాయ నిడుటా ౯ హా! ఖైదు జుల్మానలా
యన్నా! శాసనకర్తలందు సరియా ౯ నా యిట్టి యావేశముల్.

# బాల్యవివాహ తత్త్వసారము.

## నాల్గవ యధ్యాయము.

వివాహధర్మము:— తదాచరణము:—

పైన వివరించిన రెండవ యధ్యాయములో పశువులలో వివాహములేల లేవో మానవులకు వివాహములేల కావలసి వచ్చెనో, వివాహబంధము దృఢముగానుండుట కొంపగోడేర్పరుచుకొనుట, మానవ జాతులందెట్లు పశువులలోవలె,గాక మిక్కిలి యావశ్యకములై యున్నవో. మానవులు ఏమవివాహ బంధముల సళ్లుసళ్లుగా సడలించినచో క్రొయికముగా వారెట్లు పశు సంప్రదాయములకు దగ్గరదగ్గర యగుచుండిరో యీవిషయములను నిరూపించితిమి. 'వివాహధర్మములు కుటుంబ నిర్మాణమునకే యుద్దేశింపఁబడినవి– ఆకుటుంబములకు సంతానములు స్తంభములవంటివి. ప్రేమ బునాదులవంటిది. ప్రతిసంసారమునందు సంతానావశ్యకమును మనఋషులు కర్మకాండలో విధించిరి గదా. దీని యభిప్రాయము జాతిసంఖ్య వృద్ధిచెంది జాతి చక్కని యున్నత స్థితికివచ్చుననియే వారి యాశయము. జాతికి సంఖ్యాభివృద్ధియే జీవమని నేనిదివఱకే నిరూపించితిని. సత్సంతానోత్పాదనమును మానవునకు విహితవిధిగా నేర్పరచకపోయినచో జాతిలోసంఖ్యాబలము క్షీణించి కాలానుసారముగ నామావశిష్టమగునని గాబోలు, మనధర్మశాస్త్రము లీసత్సంతానోత్పాదన విధిగా నిర్ణయించుచున్నవి. మనకే యననేల? అన్ని జాతులందు సంఖ్యాబలమే దేశబలము, జాతిబలమని గుర్తెఱింగి యుండియేగదా మహమ్మదీయులలో సంఖ్యను వృద్ధిచేసికొనుటకు, క్రిస్టియనులలో సంఖ్యనధికముసేయుటకు ఇప్పుడు మతాంతరీయుల గలిపికొనుటలు (Conversions) ప్రోత్సహించి మతమిప్పించుచున్నారు. వేయేల బైబిలుకూడ సంతానోత్పాదనమునే నొక్కిచెప్పి ధర్మములక్రింద విధించుచున్నది. ఇది జీససుక్రీస్తు ప్రసాదించిన శాసనములలో నొకటి,

Commandment Go Forth and Multiply

గీ॥ బయలు దేరి జగమును వృద్ధిఁ బరపుమయ్య॥
అని శాసించుచుండలేదా? ఈశాస్త్రములిట్లేల శాసించవలెనో పరీక్షిం చెదను.

వివాహములు: ప్రేమాంకురములు, ధర్మారంభములు.

మానవునియందొకానొకదైశ్వర్య లక్షణమగు ప్రేమకళ తరళించు చుండుననియు నట్టిప్రేమకళయే వ్యాప్తిఁజెంది స్వార్థమునుండి బయలు వెడలి భార్యాపుత్రులవరకు వ్యాపించి కుటుంబములకు బ్రాఁకి జాతికి నిండి, యూరిలోనిండుకొని, దేశమున కల్లుకొని లోకమందంతట నిబిడమై పరమేశ్వరుని పాదసన్నిధికి మానవకోటిని జేర్చుచుండునని నేనిదివఱకే తెలియఁబరచితిని. ఇయ్యదియే ప్రేమ యాత్రావిధానము. ఇట్టిప్రేమ.

''అజాయమానో బహుధా విజాయతే'' యన్నట్లు పరిపరివిధ స్వభావములు కలదిగాగన్పట్టుచున్నది. పురుషుని కీప్రేమయొక్క పరి ణామదశలు వాని నొక్కొక్క సోపానమున కెక్కించుటకు కారణము లగుచున్నవి. చదువరులారా! మానవుడు పుట్టినతోడనే తలిదండ్రుల యందున బ్రేమ నభ్యసించుచున్నాడు. ఈప్రేమ కొంతకొంత స్వార్థ పరతతోమేళవింపబడినదై తలిదండ్రులు తనకుబెట్టి పోషించుచున్నారే యనితనకోసరమే వారిం బ్రేమించుట తటస్థించుచున్నది. ఈప్రేమస్వ భావము ఇట్టిది.

కాని మానవుఁడు పెండ్లాడి భార్యతో సుఖించుచున్నప్పుడు వానియం దవతరించు ప్రేమస్వభావ మొకానొక భోగపరతా స్వరూపమై మార్పుఁజెందుచున్నది. ఈ ప్రేమ కధిష్ఠానదేవత యా తుంటవిలుకాఁడు. ఇట్టిప్రేమ యనురాగరూపముగని, పరస్పరమై, యిచ్చిపుచ్చుకొనునదియై, దినదిన ప్రవర్ధమానమై పెఱిగిపెఱిగి సంతా నపుష్ప ఫల రసారంభముతో బరిపూర్ణత్వము గాంచుచున్నది.

సంతానము కలిగిననాటనుండియు మానవుల ప్రేమ యింకొక యవతారమెత్తుచున్నది. పుత్రులయందు మానవుడు చూపు ప్రేమకళ

వేరొకస్వభావము కలది. ఇంతదూరము వృద్ధిసెందుచువచ్చిన ప్రేమ, మానవునియందుగల ప్రేమరసము వడియకట్టఁబడి స్వార్థపరతకొంత వరకు పిప్పిత్తివేయబడి తేర్చియుంచబడి సత్తుదీసినట్లు వర్తిల్లుచు స్వార్థత్యాగ దీక్షలో మానవుని ప్రవేశపెట్టుచున్నది. నేటినుండియు మానవుఁడు తాను దినకుండఁగూడ పిల్లలకు బెట్టుటయు పిల్లలు తినిన తనకడుపునిండినట్లే తలంచి యానందించుటయు కలిగి మెలమెల్లగా మానవుని స్వార్థత్యాగదీక్షలోనికి దించుచున్నది.

తరువాత పిల్లల నిచ్చి పుచ్చుకొన్నచోటికి ప్రేమ జరిగి జరిగి పోవుచు బంధువులకు వ్యాపించి మెట్టెక్కి మేటులెక్కి తుదకు సమస్త ప్రపంచకము నందంతట నల్లి బిల్లిగా నల్లుకొని పర్యవసానమందు తన యొక్క చిన్నికుటుంబమునుండి వెల్లువలై పారి "ఉదారచరితానాంతు వసుధైవకుటుంబకం" అన్నట్లు వసుధయందంతటను నిబిడమై వెలయు చున్నది. చదువరులారా! చూచితిరా! ఈపైననేను వర్ణించిన ప్రేమ కళలు పృథక్స్వభావములు వేర్వేరు రకములు గలవి.

తలిదండ్రులు తనికిచ్చినట్టి ముద్దులో నున్నరంగు వేఱు. తాను భార్యకిచ్చినముద్దులోగల వన్నె వేఱు- తుదకు తాను పిల్లల కిచ్చెడి ముద్దులో గలస్వభావము వేఱు- ఈప్రేమకళలు తామప్పుడప్పుడు నూతనస్వభావశోభితములై పరమేశ్వరుఁడుకూడ ప్రేమస్వరూపు డేయని నిరూపించుచున్నభంగి.

"నవోనవో భవతిజాయమానః" యన్నట్లు క్రొత్తగ్రొత్తలై పొడమివర్ధిల్లుచున్నవి. ఇట్టి ప్రేమకు, ఇట్టి పవిత్రప్రేమ కళావికాస మునకు కుటుంబము లాలవాలములు, పాదులు, బునాదులు, కుటుంబ ములు లేనిదే ప్రేమయుండ జాలదు. విలంబిత వివాహములవల్ల బజారిం పులు మెండగుచు దుర్దశావిపాకము సంభవించినప్పుడు మనకనివార్య ఫలితము కుటుంబమునందలి ద్వేషము, సంసారభయము, కాపురముల జంజాటములనుండి తప్పించుకొని సుఖించవలెనను దురాశలు పుట్టు టకు కారణభూతములగును- కుటుంబభారమొల్లనివారు కాపురపు ఝంజాటము నొల్లనివారు చాటుమాటుచీకటితప్పుల కొగ్గి, విలంబిత

వివాహములవల్ల సంఘములో గల్గిన యవివాహిత జనసంఖ్యవల్ల మఱింత సౌకర్యము లలవడి, దేశదరిద్రత మఱింత దుస్థితికిం దోడ్పడి, తాము చెడి దేశమును సంఘమును పాడుచేయుటకు కారకులగు చున్నారు. ఇట్లు సంఘదూషకులలో రెండు తెగలు గలవు:—

(1) కుటుంబద్వేషులు (2) వివాహవిచ్ఛేదకులు.

వివాహములు విలంబితములై, స్వేచ్ఛాసంచారము పెచ్చు పెరిగినప్పుడు, దేశములం దక్రమసంతానములు మెండగుచున్నవిగదా. ఈఅక్రమసంతానములకు బోషకులులేరు. ఈతండ్రిని తల్లినెరుంగని పిల్లలగతి యేమికావలయును? గృహభారమొల్లని పిరికివారు చాటు మాటున బిడ్డలకని పారవేయుటకు కారణము స్త్రీపురుషలయందు కుటుంబ బాధ్యతావిముఖత్వమే కాని వేరేదియుంగాదు.

In 1908, there were in France 1,350,000 unmarried men over 30 years of age and a somewhat larger number of unmarried women. There were 1,804,710 families without children.

Speech by M. Klotz, French Minister of Finance.

("*Hindu*" 20—12—1912.)

1908 సంవత్సరములో ఫ్రాంసుదేశములో 30 యేండ్లవరకు పెండ్లిచేసికొన నిమగవారిసంఖ్య పదమూడులక్షలయాభై వేలమంది యున్నారు. పెండ్లిచేసుకొనని ఆడువారు కూడ నంతకంటె నెక్కువగానే యున్నారు. సంతానములేనిసంసారము లాదేశములో 18,04,710పదునెన్మిది లక్షలనాల్గువేల యేడువందల పదికలవు.

ఫ్రెంచి ఆర్థికమంత్రియం-క్లాల్సు దొరఉపన్యాసము. (హిందూ 29.12.1912)

ఇంతియగాక కాపురములభారము నొల్లకపోవుటయె ప్రస్తుత వివాహవిప్లవములకు గారణములగుచున్నవని యీక్రింది యభిప్రాయమువల్ల తెలియుచున్నది.

A very important cause of the decline of marriage rate and the rise of marriage age in the modern era is the difficulty of supportiing a family in modern society.

Wester Marck's "History of Human Marriage."

ప్రస్తుతకాలమందు వివాహములసంఖ్య తగ్గుటకును వివాహవయస్సు హెచ్చుచేయుటకును ముఖ్యమైనకారణములు ఈనాటిసంఘమునందు సంసారభారము

నిర్వహించుటయందు మానవులకుఁ గల పిరికితనము దుర్ఘటత్వములే యగును గాని వేరుకాదు.

వెస్టర్మార్కు వ్రాసిన "మానవవివాహచరిత్ర"

A tolerated house is absolutely necessary at present to protect woman from disease and immorality.

Safe marriage by *Ettee A. Rout P. 20.*

సమస్తవిధముల సమాధానమునంది యతికిన కాపురములే స్త్రీలను వ్యభిచారమునుండియు చిలిపివ్యాధులనుండియు సంరక్షించుటకు మిగుల నావశ్యకములై తనరారఁగలవు.

సురక్షితవివాహములు, ఎట్టి ఏ. రౌతు వ్రాసినది పుట 20.

ఈ కారణములవల్ల కుటుంబములు ప్రేమరసంపు గనులగుచున్నవి. కుటుంబమే లేకున్న ప్రేమయే లేదు. వివాహఫలితమే లేదు. తాత్కాలిక ప్రేమచే జనించిన సంతానమునందు ప్రేమ కవకాశము లేదు. మగలను మార్చుకొనుచుండు యువతులకు తాము కోపముచే విడిచిన మగనివల్ల బడసినసంతానములందు ప్రేమతగ్గుచున్నది. అవివాహితలగు కన్యల సంతానముల కిదియేగతి-వారిప్రేమకు నిలుకడ లేదు-భార్య తననువిడిచినదను కోపముచే తండ్రికిసైత మా సంతానముపై ప్రేమ క్షీణించుచున్నది. దీనికికారణము గృహసంస్థాపనాభీరుత్వము.

The whole structure of civilization depends on the stability of our homes.

Bernar Macfyden "How to get married" *P. 21.*

తే॥ గీ॥ భవ్యనాగరకతయను♦భవనమునకు
స్థిరములగు కాపురములె మో♦సెడిబునాదులు

బర్నరు మెక్‌ఫయిడన్ వ్రాసిన "పెండ్లియెట్లు" పుట 21.

ఇట్టి గృహభారనిర్వహణమునకు జంకి హంగామీాపెండ్లిండ్లు చేసికొనవలెననియు, నిట్టి క్షణికక్షణికవివాహములకు బుట్టిన సంతానములు శాసనసమ్మత క్రమసంతానముగా బరిగణింపవలయుననియు, అట్టి తలిదండ్రులు చీకటితప్పు చేసినట్లు తలంచబడకుండవలయుననియు సలహాలనిచ్చుచు అమెరికాలో "Companiorate marriages Trial mar-

riages'' నన వాసపు పెండ్లిండ్లు మాసరా పెండ్లిండ్లు అనబడు వివాహము లను Ben Lendsay (బెంలిండెసె) దొర ప్రకటించుచున్నాడు.

ఇట్టివివాహములు కొన్ని యడవిజాతులలో గలవు. ఇవి పశు సంప్రదాయమునకు కడుంగడు దగ్గరయగుచున్నవి. ఇల్లు, ఇంటిబాధ్యతలను ప్రజలొల్లమిచే నీ మెరుపుతీగె పెండ్లిండ్లు వారికి కావలసివచ్చెను గదా!!!—ఇం దేమైన ప్రేమ కవకాశముకలదా? మీరే యాలోచించుకొనుడు. నాగరకతయన్న నిదియే గాబోలు.

ఇంక వివాహవిచ్ఛేదములు తరుచుగా నుండుచోటగూడ నీ పవిత్రప్రేమదేవతకు నిలువ నీడలేదు. స్త్రీలప్రేమ, పురుషులప్రేమ మిడత లెగసియాడునట్లు చెంగలించుచుండునుగదా. ప్రేమ నిలుకడగని స్థావరముగా నిలుచుట కవకాశమేదీ? చూచితిరా అమెరికాలో వివాహవిచ్ఛేదముల సంఖ్యను.

| సంవత్సరం | వివాహములు | భార్యలువిడిచిన కేసులు | భర్తలువిడిచిన కేసులు | మొత్తం |
|---|---|---|---|---|
| 1906 | 853290 | 48607 | 23455 | 72062 |
| 1916 | 1040684 | 74893 | 33809 | 112036 |
| 1923 | 1223924 | 111480 | 52999 | 165096 |
| 1924 | 1178318 | 115328 | 52984 | 170952 |
| 1925 | 1182033 | 121333 | 52147 | 175449 |
| 1926 | 1202574 | 125563 | 52834 | 180853 |

అమెరికా జనాభా 11,78,53,495 అనగా మన యిండియాలోని జనాభాకు దాదాపు మూడోవంతు మాత్రమే.

విటేకర్ పంచాంగమునుండి సంగ్రహీతము.

దానంజేసి యెన్ని పెండ్లిండ్లు జరిగెనో అన్ని వివాహవిచ్ఛేదములు జరుగుచుండెడి దేశములలో ప్రేమ మందునకైనను దొరకదు. భగవంతునికృపకు వారు చాల దూరులు. ఏలయన సంసార ముండినగాని ప్రేమసస్యమునకు క్షేత్రము దొరకదు. మనలో ప్రాయిక

ముగా చూచితిరిగదా, "వానికి పిల్లలు లేరురా అందువల్ల వాఁడు కఠిన హృదయుఁడు, కర్కోటకు"డని ప్రజలు చెప్పుకొనుచుందురు. బిడ్డలు లేక పోయినంతమాత్రమున మానవుఁడేల కర్కోటకుఁడు గావలయును? అవును ఇది కొంతవఱకు నిజమే–పిల్లలు లేనిచో స్వార్థత్యాగగుణమున కాధారమగు సంతానప్రేమ నెఱుంగనివాఁడగును. దానంజేసి సంతానముఁబడయుభాగ్య మెఱుగక తానుదినకుండ పిల్లలకు బెట్టగల స్వార్థత్యాగదీక్ష నెఱుంగనివారికి యెక్కడిదయ? యెక్కడిప్రేమ? చాలా దూరము–ఇదే యభిప్రాయమును (Rev Henry Drummond) రివరెండు హెన్రీ డ్రమ్మండుదొర (Ascent of man) "మానవవృద్ధి" అను పుస్తకములో

"The germ of altruism is connected with the functiono reproduction."

"అన్యశ్రేయోభిలాషపూర్వకములగునట్టి సర్వధర్మగుణముల కంకురములు సంతానోత్పాదనతో కడు దగ్గరసంబంధము కలిగియున్నవి."

ఇందువల్ల సంతానముకలిగినవెంటనే మానవుల కొకానొక విధమగు ధర్మగుణము, దయ, స్వార్థత్యాగము మొదలగు లక్షణములుదయించుననుట సమంజసముగానే తోచుచున్నది. కావున ప్రేమ యంకురించుటకేమి, ధర్మగుణ ముదయించుటకేమి, మానవులందు స్వార్థత్యాగమును గఱపి,

"త్యాగేనైకే అమృతత్వ మానశుః"

అన్నట్లు త్యాగమువల్ల ముక్తిమార్గములోఁ బ్రవేశ పెట్టుటకేమి వివాహములే ముఖ్యకారణము లనంబడవలయునుగదా. ఇట్టివివాహములు తొలుదొల్త నలవరించునవి చక్కగ స్థిరపడినకాపురములు. ఈకాపురములే దేశక్షేమమునకు, నాగరకతకు, విజ్ఞానమునకు మూలస్తంభములై పరగుచున్నవి. దానంజేసి విలంబితవివాహములవల్ల ఫలించు ఆకస్మికసంయోగములు, గృహభారనిర్వహణద్వేషములు, క్షణక్షణములుగా బ్రవర్తిల్లు స్త్రీల చంచలహృదయములకంటె మఱింత చం

చలములైన వివాహసంబంధములు పెండ్లిండ్లసంఖ్యకంటె యెక్కువ మై పెచ్చుపెరిగిన వివాహవిచ్ఛేదములు, దేశానర్థక హేతువులని వేఱె చెప్పవలయునా? స్పష్టముగా దేలుచున్నది.

## మానసంరక్షణ.

వివాహములు స్త్రీపురుషుల మానసంరక్షణకు సహాయకారులగుచున్నవి. అందువల్లనే మనఋషులు స్త్రీపురుషులకు కామోదయము కాబడినవెంటనే వివాహము చేయవలయునని ధర్మశాస్త్రములందు నిర్ణయించుచున్నారు. స్త్రీలు రజస్వలలైనవెంటనే కామోదయముకల్గును గాన నప్పటప్పటికే తత్పూర్వమే నిర్ణయింపఁబడిన భర్త యొకడుండుట యావశ్యకమే గాని నాటినుండియు కాంతలు మగల వెదకికొనుట కారంభించుట హేయముగదా. అందువల్లనే భారతీయులగు మహర్షులు రజస్వల యగుటకు పూర్వమే భర్త సిద్ధముగా నుండవలయు నను తర్కము నాధారపరచుకొని ధర్మనిర్ణయము గావించిరి.

10 యేండ్లకు వేడిదేశములలో కాంతలు రజస్వల లగుదురు గదా. అయినాడుకే వారికి మన్మథతంత్రమంతయు నాకళింపయినదా? కామోదయము కామోదయమని వాపోవుచుంటివేమి నీకు నెట్లుతెలిసినదా? యని కొందఱు నన్ను చెప్పజూచిరి. వారికిదివఱకే ప్రథమాధ్యాయములో 7 యేండ్లతరువాత వివాహజ్ఞాన ముదయింపగలదని మాత్రమే ఋజువుచేసితిని. గాని యిప్పుడు కలికాలమహిమచే కామవికారములుంగూడ పిన్నవయసులోనే దాపురించుచున్నవని నేనమెరికాచరిత్రనుండి చూపించెదను:—

A little girl of seven years belonging to a most refined family had intercourse with her older brother and with several of his friends. Another such case, was that of a group of five children, two girls and three boys living near one another in an aristocratic neighbourhood who repeatedly had intercourse with

her and boasted of it to other children. The oldest of
s a boy of 10 years.

. another case was that of a girl of nine years living
parently sheltered circumstances who took a curious
having " many lovers."

Laws of sex by
Hooker Page 328.
Quoted from " Uncle Sham" *P. 67.*

జ్ఞానసంసారములలో బుట్టిపెరిగిన యేడేండ్ల వయస్సుగల ఒక చిన్నపిల్ల
సన్నతోడను వాని స్నేహితులతోడను సంభోగించెను.

కొకయెడ నొక భాగ్యవంతులుండు కొంపలో అయిదుగురుపిల్లలు. ముగ్గురు
యిద్ద రాడుపిల్లలు (10 యేండ్లలోపువారు) తమలో తా మొకరితో
స్త్రలవిడిగా కాపురములు సేయు చుండిరి. ఈసంగతులితరపిల్లలతో చెప్పుచు
గొట్టుకొనుచు, గర్వించుచుండెడివారు. వీ రయిదుగురిలో పెద్దవానికి పది
ప్రమే.

క నొకయెడ చాటుమాటున బెఱిగిన యొక 9 యేండ్లపిల్ల తన కనేక
ంలుగలరని ప్రగల్భముగా చెప్పుకొనుచున్నది.

హూకరుదొర వ్రాసిన "దాంపత్యధర్మము"లను గ్రంథము.
పుట 328. అంకుల్ షాం 67 పుట.

కావుననే హూకర్ దొరవారు

is not very unusual even among the most civilized and
families for little ones of seven and eight to have lovers
t their own age with whom they have sexual intercourse
nes in the presence of others.

*Ibid P. 328.*

ంగరకతగని భాగ్యవంతములయిన సంసారములలో చాలవఱకు యేడెనిమి
లు తమకీడగు మగలతో భార్యలతో యితరులు చూచుచుండగనే సంభో
సర్వత్ర సర్వసాధారణముగా గన్పట్టుచున్నది.

ఈ పైనిజెప్పినవిషయములను జదువుటకే మీ కెంతో యస
గా దోచవచ్చునేమో కాని సృష్టియందు నిజస్థితులు కొంత

కొంత యసహ్యములుగా నుండకతప్పవు. ఈయసహ్యత యనివార్య మనియే పెద్దల యభిప్రాయము.

"Truth is always ugly."

"ప్రియంచ సత్యంచ సుదుర్లభం వచః"

(భారవి)

"వాస్తవస్థితి తియ్యగా వరలఁబోదు"

చదువరులారా! "నిజమాడిన నిష్ఠుర"మన్నట్లు నేను చూపించిన పరిస్థితులను విని మీయొడలు జలదరించిన నాశ్చర్యమేమియు లేదు. నేనందుకు క్షమాపణ కర్తుండ నేసుమీ. ఇంకను పిల్లలకు బుద్ధి తెలియనిదే పెండ్లిండ్లు చేయుచుంటిమని మనల నెవ్వరు నిందించగలరు? పది యేండ్లకే వివాహజ్ఞానముతోపాటు ఔరా! సంభోగజ్ఞానముకూడ గల్గుచుండ కలికాలమందు బాల్యవివాహముల నిషేధించు శాసనములు పూర్తిగా అవిద్యాతాండవములే యనవలయును. కావుననే గాబోలు బడిపిల్లలు చెడి పెడదారులంబడిపోదురేమోయని జంకి, అప్టన్ సింక్లర్ దొరవారిట్లు వ్రాయుచున్నారు.

"I very much question whether, if we would apply our wisdom to the task of getting our young people happily mated before we send them to college we should not get a lot of more serious study out of them than we do now with all their fussing, flurting and dancing."

మన తెలివితేటల ప్రయోగించితిమనుకొనుచు పిల్లలకు పెండ్లిండ్లుచేసి బడికి బంపించిన చదువురాదని మనము సేయుచుండు కుంటితర్కమును నే నాక్షేపించి త్రోసివేయఁదలఁచుచున్నాను.

పెండ్లి సేయకుండ విద్యార్థులను బడికిబంపినచో వారుసేయు గందరగోళములు, తకతక్కలు, తందనాలు మెండుగనుండును. పెండ్లి చేసిన నీ గగ్గోలు లేకుండా చక్కగా చదువు సాగును.

అప్టన్ సింక్లర్ దొర

వ్రాసినది.

పెండ్లిచేసి పిల్లలను స్కూలుకు పంపినయెడల చాలా శ్రేయస్కరమని వేత్తల యభిప్రాయమైయుండ బాల్యవివాహముల నిషేధించు టేమినీతియో విచారించుకొనుడు. ఇంతియగాక హాస్పిటల్ ఆసుపత్రిలో నీళ్ళాడినకన్నెలందు 12 నుండి 16 యేండ్ల వయస్సుగలవారు 500 గలరనియు వీరి ప్రసవవేదన కడుస్వల్పమనియు, పుట్టినపిల్లలు మరింత బాగుండిరనియు ఈవిషయము బాల్యవివాహముల నిషేధించువారికి బుద్ధిచెప్పక తప్పదనియుగూడ సింక్లరుదొర ప్రకటించుచున్నాడు.

పరిస్థితు లిట్లుండ వీటిని గమనింపకయే హోము మెంబరు (Mr. Crearar) క్రియరు దొరగారీదేశములోని వివాహవిధానమును "కోతచేటు" (Corroding evil) యని యెట్లు ప్రకటించగలిగిరో నాకర్థముగాకున్నది. చెప్పినమాట సమర్థించుకొను శక్తి వీరిలో గుండునున్న. ఏమైన నిదర్శనములం జూపఁగలిగిరా? ఏవో నాల్గు పెద్దపెద్ద మాటలువేసి తమ వాగాడంబరముం గనుపరచి యీచట్టమును బలాత్కారముగా నడావుడితో ఏమో యింకొకసభకు వాయిదా వేస్తే కొంపలుపోవునేమో యనుభీతిచే నెట్టి తమసంఖ్యాబలము నాధారము చేసుకొని బ్రాహ్మణీకముపై ఫిరంగిదెబ్బ వేయగలిగిరేగాని పండితాభిప్రాయముల చెవిఁబెట్టుసహనముఁ జూపించగలిగిరా లేనేలేదు సుమీ.

ఇంతయేల దాంపత్యరహస్యములను గ్రంథరూపకముగా ప్రకటించి పాశ్చాత్యదేశములయందు శృంగారకళాశాస్త్రవిదుషీమణులలో ప్రామాణికురాలుగా నెన్నంబడుచున్న (Dr. Marie Carmichael Stopes) డాక్టరు మేరీ కార్మయికేలు స్టోప్సు దొరసాని తాను రచించిన (Enduring passion) "ఇంద్రియసహనము" అను గ్రంథములో నెట్లు వ్రాయుచున్నదో మన హోము మెంబ రెరుంగడు గాబోలు.

It is not intended by nature for a man of full age to continue unmarried year after year. Early marriage is the natural and still the right thing. Almost every day that passes increases my conviction that the race runs innumerable dangers from the

habit of delaying marriage which is becoming too common. Late marriage is the source of innumerable social and physical evils (and incalculable unhappiness and discontent.) Nature may have its revenge and on his late marriage a man may find himself impotent or nearly so or else so excited and overwrought by union that a true marriage is almost or quite impossible because of premature ejaculations.) The best way to avoid such evils and to live normally is to marry young and remain in love.

(*Page* 71.)

ఈడువచ్చినతర్వాత బెండ్లిచేసుకొనకుండ పడియుండవలెనని ప్రకృతిలోనున్న పరాత్పరుని యిచ్ఛగాదు. బాల్యవివాహమే స్వాభావికము. సక్రమము ప్రకృతిలోని నిర్ణయమదియే. వివాహములను చాలకాలమువరకు చేయకుండుట యీనాడు సర్వసాధారణమయినను విలంబితవివాహములు బహుళానర్థహేతువులై జాతి కపాయముకలిగించునను నమ్మకము నానాటికి నాకు వృద్ధిసెందుచున్నది. విలంబితవివాహము లనేక సంఘదురాగతములకు దేహధ్వంసమునకు హేతువులగుచున్నవి. అతిశయించిన దుఃఖమును అసంతుష్టిని బుట్టించుచున్నవి. ప్రకృతి వివాహముల నాలస్యముగఁగావించినందుకు మనకు దగుశాస్తి చేసియేతీరును. ఏలయనిన, యీడుముదిరి పెండ్లిచేసుకొన్నచో త్వరలో నపుంసకుడో వానికి దగ్గరచుట్టమో యగును. లేదా యుద్రేకియై దుర్భరంబగు నతిలోలతచే సడలిపోయి యింద్రియస్థయిర్యము గోల్పోయి తీవ్ర శీఘ్రస్ఖలనాదులకు లోనై వివాహముచేసుకొన్న ఫలమేలేక నిష్ఫలమై చెడిపోవుచున్నాడు. ఇట్టిదుస్థితినుండి తప్పించుకొనదలంతుమేని, సక్రమముగా జీవించదలంతుమేని యుపాయమేదనగా జిన్నవయసులోనే పెండ్లిండ్లుచేసుకొని భార్యయందనురాగముతోనుండుట యొక్కటేయుపాయము.

పుట 71.

ఇందువల్ల స్త్రీపురుషులలో బాల్యవివాహములు మానసంరక్షణకు తోడ్పడుననుట కేమి సందేహముకలదు?

చదువరులారా! ఇంతఘోషయేల. మనభార్యలవద్ద మనము సుఖించుటయందుగల స్వాతంత్ర్యము స్వేచ్ఛయుగూడ మిగిలిన స్వేచ్ఛలతోపాటు సర్కారువారి కర్పించి వారు చెప్పి శాసించినట్లు మనము భార్యలతో సుఖించవలసినగతి పట్టించుటయె దేశనాయకులు సంఘసంస్కర్తలతో చంకలుగలిపి తెచ్చిన "స్వరాజ్య"ము గాబోలు,

మ|| మన పెండ్లింబుల నంటఁగూడదని సా-మ్రాజ్యంబు శాసించుటే
ఘన మం చెంచి స్వదేశనాయకులు సం-ఘస్వేచ్ఛ సర్కారు క
ప్పనముంజేయుటయే స్వరాజ్యపదవీ-ప్రారంభమా నేమొ మీ
మనమం దించుక చింత సేయుఁడిది దు-ర్మార్గంబొ సన్మార్గమో.

ఇంక శాసనావశ్యకమునుగుఱించి చర్చించెదను.

---

# బాల్య వివాహ తత్త్వసారము.

## అయిదవ అధ్యాయము

### శాసనావశ్యకత?

ఈవిపరీతచట్టమున కేమైనను ఆవశ్యకము కలదా? యను విషయ మిందుఁ జర్చింపఁ దలఁచితిని. ఈశాసన మింతవఱకు అనఁగా బ్రిటీషుప్రభుత్వము ప్రాప్తించిన 200 యేండ్లవఱకుఁగూడ నేశాసన కర్తలచేతనుగూడ సంకల్పింపఁబడనిదే యీనాఁటికి నవీన రాజ్య సంస్కారముల క్రింద గుంపులుగుంపులుగా శాసనసభలలో ప్రతినిధుల మని ప్రజాస్వత్వసంరక్షకుల మని చంక లెగురవేయుచు దూటిన-కాదుకాదు- మనమే దయదలఁచి చేసేతుల నేఱి కోరి పంపిన-మననాయకు లనుకొనువారు దెచ్చిన భిక్షయై తనరారుచున్నది. ఈ శాసనము దేశమునకు నిజముగా నవసరమై యున్నందున నిర్మింపఁబడినదా? లేక యేమీతోఁచని యెసెంబ్లీసభ్యులు ప్రజల నెందఱనో యేడిపించుటకు నేర్పఱిచిన చట్టమా? లేక ప్రస్తుతము కొన్నివేలకువేల యేండ్లనుండి క్రమానుగతముగా వచ్చుచున్న యీ వివాహాచారమున కేమైన ననర్థ మారోపింపఁ బడినదా? నూతనముగా నిర్మింపఁబడిన యీశాసనాచరణవంటి పద్ధతు లితర దేశములు దాల్చి బాపుకొనుచున్న లాభనష్టములేమైన గమనించి నిర్మింపఁబడినదా? యను మొదలుగాఁగల యనేకవిషయము లిందుఁ జర్చింపఁబడును. ఈశాసనము అనావశ్యకము- అధర్మము- అనర్థకము- అక్రమము- అపభ్రంశము- అపకారకము- అసహ్యకరము- అధోగతి

ప్రదము-అనర్థము- అపాయకరము. ఇట్లు దుర్దశాకారశోభితముగా నుంటయేగాక ఇంక ననేకము లగువిధముల జాతీయతాధ్వంసక మని యిచట నిరూపించెదను.-

ఇంతవఱకుఁగూడ నెన్నియో ప్రభుత్వము లుదయించినవి, కాలచక్ర ధాటికి తాళక చల్లగా నస్తమించినవి కాని యీనాటి వఱకేప్రభుత్వముగూడ కులాచారధర్మములపై ప్రవేలువైచి తాఁకి యుండలేదు. బ్రిటీషుప్రభుత్వ మిచ్చిన నూతనసంస్కారము లీయఘటనాఘటనకు పటుతరములై యుంట సంభవించుట గలిగినది.

(1) మహమ్మదీయ ప్రభుత్వము బాల్యవివాహకారణమా?

కొందఱు మహమ్మదీయప్రభుత్వములో నవివాహితలగు కన్నెలను బాధపెట్టుటచే నీబాల్యవివాహాచార మార్యులలోఁ బొడమినట్లు చెప్పుచున్నారు గాని యందేమాత్రమేని సత్యలేశమైనఁ గన్పట్టదు. మహమ్మదీయ ప్రభుత్వములో నున్నట్టియీబాధ నేఁటిబ్రిటిషు ప్రభుత్వములో లేనందున నాబాల్యవివాహముల కావశ్యకము దీరిపోయినదని కొందఱు తలంచుచున్నారు. ఇది చాలా పొరపాటు.

The custoum of child marreage is not mearly due to the accident of moslem conquest when the rulers promished to protect all girls who were already affiauced But there is more in it. There is the difference of ideals, In Hindu India, because the house hold is the essential element of seecial stucture, marriage is almost coupulsory like consireption in Europe on the threat of war.

*Rev J. T. Davis*

(నిఖా) వివాహ మయినకన్నెలను రక్షించెద మని దీక్షవహించిన మహమ్మదీయ ప్రభుత్వము మనకు సంభవించుటవల్ల బాల్యవివాహములు సేయుఆచారము ప్రారంభించినట్లు చెప్పువిషయము నటుంచినను వీనియం దంతరార్థ మెక్కుడున్నది. ఇందులకు హేతువులు ఆదర్శములలోఁ గలభేదములే కాని వేఱుగాదు. హిందూభారతభూమిలో సంఘనిర్మాణమునకు గృహస్థాపనము మూలస్తంభమై యున్నందున, ఈదేశములో వివాహము మనయూరోపుదేశములో యుద్ధము లారంభించునప్పు

డవలంబింపఁబడు లావణములవలె (నిర్బంధమైనికవృత్తివలె) ననివార్యమయి తన రారుచున్నది.

(రెవరెండు. జె. టి. డేవిస్ దొరగారు వ్రాసినది.)

ఈసందర్భము లిట్లుండఁగా వేదయుగమునందు రజస్వలానంతర వివాహము లాచారములుగాఁ గన్పట్టుచున్నను కాలక్రమముగా నట్టి యాచారములందు కొన్నిదుర్గతు లుదయించి రజస్వలానంతర వివాహములు పోయి రజస్వలాపూర్వవివాహము లంకురించినట్లు కొందఱు చరిత్రకారులు తలంచుచున్నారు. చిరకాల మిట్లు కన్యలను అవివాహితలఁగా నుంచినయెడల పెరిగి పెద్దవారై పిల్లలు తలిదండ్రుల విడిచి యుండఁజాలని హేతువువల్లనో లేక తలిదండ్రులే పిల్లలను విడిచి పెట్టి యుండఁజాలని కారణమువల్లనో కన్యలు వరుని గోరకుండ తలిదండ్రులవద్దనే యుండుట తటస్థించి, కన్నెలకు దుర్మార్గులచే దోషారోపణలు ప్రబలి వివాహములు కాక యపకీర్తికిఁ బాలై, లేదా కన్నెతా నానాఁటి కెవరినో యడావుడిగాఁ గోరుకొని దుర్గతుల మునింగి చెడి యిట్లనేక విధముల సంఘశుద్ధి సమసిపోయి కులాచారములు నేలకుఁ గోలకు వచ్చుటచే స్మృతికర్తలు తరువాత తరువాత నిట్టి బాల్యవివాహములు ప్రారంభింప ధర్మము లవలంబించినట్లు తలంచుటయుఁగూడ కొందఱిలో కలదు. 8 వ పుటలో దిగువభాగమున అవినాశచంద్రదాసుగారు వ్రాసిన "ఋగ్వేదజ్ఞానము" (Rig Vedic culture) అను గ్రంథార్థముల నింకొకతూరి పరిశీలింపఁ బ్రార్థించుచున్నాను. వేదకాలములో బాల్యవివాహములులేక తరువాత వచ్చిన వనియును, బాల్యవివాహములు మహమ్మదీయుల కాలములో వచ్చిన వనియును చెప్పు తర్కములు కడుంగడు అసంగతములు—వాని నిచట నిరూపించెదను. మున్ముందు రామాయణకాలమును గుఱించి నిదర్శనములఁ జూపెదను:—

వాల్మీకిరామాయణము—అరణ్యకాండ 47 సర్గలో 10 శ్లోకము.

"మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః,
అష్టాదశ హి వర్షాణి మమ జన్మని గణ్యతే"

అని సీత రావణునితోఁడ కపటముని వేషకాలమునందు వచించి నట్లు కలదు. దీనియర్థ మేమనఁగా,

**తే॥** గీ॥ "నాదుపతికిఁ దేజోనిధి కైదు నిరువ
దేండ్లు (25) నాకును (18) పదునెన్మిదేండ్లు గలవు"

రామునికి 25 యేండ్లు కలవట! సీతకు 18 యేండ్లుమాత్రమే కలవట! ఇద్దఱకు ఏడేండ్లు వార కల దని తేలుచున్నది. ఇది యి ట్లుంచుకొని బాలకాండ కేఁగుదము. విశ్వామిత్ర యాగసంరక్షణ గావించి తిరిగి వచ్చుచున్నప్పుడే కదా రామునకు వివాహమైనది. శ్రీరాముని తనయజ్ఞసంరక్షణార్థమై పంపవలసినదని విశ్వామిత్రుఁడు కోర గా దశరథుఁ డిట్లు పలికెను:—

"ఊనషోడశవర్షో మే రామో రాజీవలోచనః,
న యుద్ధయోగ్యతా మస్య పశ్యామి సహ రాక్షసైః"
(బాలకాండము: 20 సర్గ 2 శ్లో.)

"**తే॥** గీ॥ అంబుజాక్షుఁడు మారాముఁ డాజిఁ బోరి,
రాక్షసుల నుక్కడంపనేరఁ డని యెంతుఁ
గొంతకొఱంత పదాఱేండ్లకొడుకునందు,
యుద్ధయోగ్యతఁ గనఁజాల కుంటినయ్య"

దీనిఁబట్టి వివాహకాలమునకు శ్రీరామునకు వయసు 16 యేండ్లకంటె నెక్కువ లేదని తోఁచుచున్నది. సీతకును రామునకును ఏడేండ్లు వార కలదు గాన పెండ్లినాఁటికి సీతకు 8 యేండ్లు షుమారు కలవని తేలుచున్నదా?

వివాహకాలమునకు రామునకు 16 యేండ్లు సీతకు 8 యేండ్లు గాఁ దేలినది. ఇంక రాముని తమ్ములకు లక్ష్మణభరతశత్రుఘ్నులకి య్యఁబడిన సీతాదేవి చెల్లెండ్రవయస్సు లెంతయుండెనో మాచదువ రులే యూహింతురుగాక. అయ్యా! ఇవి బాల్యవివాహములా? రజస్వ లానంతరవివాహములా? నావంకఁ దిరిగి గట్టిగా వచింపుఁడు. రామా యణయుగమునాఁటికే బాల్యవివాహములు ధర్మబద్ధములై విలసిల్లు చున్నవనుట కేసందియము లేకపోఁగా పై పెచ్చుమనసంస్కర

లీబాల్యవివాహములు మహమ్మదీయయుగములోఁ బుట్టిన వని తర్కిం చుట కంఠశోష గాదా? ఏమెఱింగి కుంటితర్కములకుఁ జొరంబడి మిడిమేలపు చట్టములఁ బుట్టింప సాహసించిరో పరమాత్మునకే యెఱుక. ఇంకొకవిషయము కలదు:— సీతారామకల్యాణమంటపమునం దు సదస్యులు బ్రహ్మర్షి వసిష్ఠుఁడు, మహర్షి విశ్వామిత్రుఁడు, రాజర్షి జనకుఁడు, వామదేవుఁడు, జాబాలి, కశ్యపుఁడు, కాత్యాయనుఁడు, దశరథమహారాజు, అయోధ్యాపట్టణాస్థానజనులు, మిథిలానగరవిద్వాంసు లెందఱెందఱోయుండిరి; ఆనాఁటికి బాల్యవివాహములు నూతనాచారములైన, వేదవిరుద్ధములైన, సర్వధర్మాంగీకారములే కానిచో ఈఋషులందఱు తిరుగఁబడియుండరా? వేయేల మున్ముందు మన విశ్వామిత్రుఁడు వసిష్ఠుఁడు కలియఁబడి జందెములఁ ద్రెంచుకొనియుండరా? ఎందుల కీసంస్కర్తృ నామధారుల కుతర్కములు విని మోసపోయెదరు? ఇంకమీఁద వేదములో స్థితిగతు లెట్లుండినవో విచారింతము. వేదశాస్త్రములను పరిశీలించిన కొంద ఱాంగ్లవిద్యావంతులు కూడా వేదయుగమునందు బాల్యవివాహములు గూడ నిప్పటివలెనే కల వని నొక్కివక్కాణించుచున్నారు.

Infant marriages or rather pre-pubescent marriages were not entirely unknown in Rig-vedic times.

*Rig Vedi c Culture (Marriage) Page* 251.

బాల్యవివాహము లనఁగా రజస్వల యగుటకంటె ముందు చేయు వివాహములు, ఋగ్వేదయుగమునాఁటికే ప్రచారములో లేకపోలేదు.

ఋగ్వేదిక్ కల్చర్ (వివాహములు.) పుట 251.

ఇంతియగాక ఛాందోగ్యోపనిషత్తు మొదటి యధ్యాయము పదియవకాండలో మొదటి అధ్యాయములో

"మటచీహతేషు కురుషు ఆటిక్యా సహ జాయయోష స్తిర్హ-
చాక్రాయణ ఇభ్యగ్రామే ప్రద్రాణక ఉవాస"

ఛాందో I—10—(1)

కురుదేశమునందు మటచీలచే (ఒకవిధమగు మిడతలు పైరు పాడుచేయునవి) క్షామము సంభవించినప్పుడు ఉషస్తిచాక్రాయణుఁడను మహర్షి ఈతేరని తనభార్యతోఁగూడ ఇభ్యగ్రామమునందు నివసించెను.	ఛాందోగ్య—I—10—1.

చాక్రాయణమహర్షికి ఆటికియగు జాయ (ఆటికి)అనఁగా స్తనోదయాది యౌవనచిహ్నములు రాని-చిన్నపిల్ల (జాయ)అనగ పెండ్లముఅని అర్థము- స్పష్టముగా నీఋషి బాల్యవివాహము చేసికొన్నట్లు చక్కగా విశదమగుచున్నది. ఈమహర్షి కాలమునాఁటి కనఁగా వేదయుగములోనే రజస్వలాపూర్వవివాహములు ఋషులలో సైతమున్నట్లు స్పష్టపడినదిగదా. బాల్యవివాహములు మహమ్మదీయయుగములోఁ బుట్టినవను తర్కము, బాల్యవివాహములు వేదయుగములోనివి కావనుతర్కము, ఇటీవల వచ్చిన దురాచారముల నిర్మూలించుటకు ప్రస్తుతము చట్టము పుట్టవలసివచ్చినదనువాదము సత్యావాసనారహితమనుట నిర్వివాదము. ఈకారణములచే నీచట్టమున కావంతయు నావశ్యకము లేనేలేదు.

### 2. అనాదిత్వము-అనపాయత్వము-అదోషత్వము.

ఈపైనఁ జెప్పఁబడిన సంగతులను బట్టి యీబాల్యవివాహవిధానమనాది యనియు, వేదకాలమునాఁటికే చలామణిలో నున్నదనియు, రామాయణ యుగములోనే నిరాక్షేపప్రచార మలవడి యున్న దనియును ఋజువుచేసియున్నాము. ఇట్టి అనాదియాచారములను ఏప్రభుత్వమువారును గూడ కదలించియుండలేదు. ఈ వివాహాచారములు కులాచారములు ప్రజలలో మిగులఁ బవిత్రములుగా నెన్నఁబడుచున్నవి. ఈ కులధర్మములు మహావిప్లవములను దేశక్షోభములను క్రూర దండయాత్రలను పరరాజపరిపాలనలను డీకొని జయప్రదముగా నోహటించి గాలివానల నెన్నింటినో దాఁటి గెల్చి యానందించుచు కొటారు కొమ్మలచే నాకసమును ముద్దులాడుచుండెడి వృక్షరాజములవలె విరాజిల్లుచున్నవి. హిందువులను దాను చక్కగా నెఱుంగకున్నను రాజ్యాంగ దూరదృష్టిపాటవము, వాగ్మిత్వ సామరస్యముల వల్ల హిందువులలో కులధర్మములవిషయమై పార్లమెంటుసభలో (రాజుల మొదుట నింగ్లండులో) ముచ్చటించుచు హిందూదేశ స్తంభమునకు కులధర్మములే బునాదులని వేనోళ్లఁ దన వాగ్మితావికాసమును గుమ్మరించి,యెడ్మండుబర్కు దొరగారిట్లు ఉపన్యసించియున్నారు:—

They (casts) have existed in spite of Mohammadan and Portuguese begotry, in spite of Tartarian Arabian tyranny, in spite of all the fury of successive foreign conquests, in spite of a more formidable foe—the avarice of the English Dominion. I have spoken now, my lords of what their principles are, their laws and religious institutions in point of force and stability—I have given instances of their force in every circumstance in which all the institutions of mankind in other respects show their weakness. They have existed when the country has been otherwise subdued. This alone furnishes full proof that there must be some powerful influence resulting from them beyond all our little fashionabie theories upon such subjects."

*Edmund Burke's spceches.*

హిందూదేశములోని కులధర్మములు, మహమ్మదీయుల మత దురభినివేశము నకును, పోర్చుగీసువారియొక్క మూర్ఖంపుపట్టుదలకును తట్టుకొని నిలువఁగలిగినవి. టార్టారుజాతుల క్రౌర్యమునకు, అరేబియనుల ఘాతుకముల కోహటించి నిలువఁగలిగి దొంతరదొంతరలుగా పొరలివచ్చు పరరాజుల దండయాత్రలధాటికి నిలువఁబడి బ్రతుకగలిగినవి. వేయేల? అంతకంటె భయంకరమైన అసాధ్యమగు శత్రువగు మన ఆంగ్లేయరాజ్యదాహమునకు తాళుకొనఁగలిగినవి. ప్రభువులారా! వారి(జాతులందుఁగల)ధర్మము లెవ్వియో మీకు చెప్పితిని. వారి న్యాయపద్ధతులు వారి మతసంస్థలందుఁగల పాటవము స్థైర్యముగూడ వర్ణించితిని. మానవజాతులు ఇతరచోట్ల తమతమ దౌర్బల్యమును జూపినతావులందు వీరు (హిందువులు) గనుపరచిన అపారబలసామర్థ్యముల కనేకనిదర్శనము లిచ్చియుంటిని. దేశమంతయును పరరాజులు జయించి కొల్లగొట్టుకొనిపోయినను కులాచారములు నిలువఁబడియే యున్నవి. మననాజూకు సిద్ధాంతములను మించిపోయినట్టిదియు కులక్రమానుగతమైనట్టిదియు నగు నొకానొక బలవత్తరమగు శక్తిప్రాబల్య మీకులధర్మములందుఁ గలదనుట కిదియే పరిపూర్ణ సాక్ష్యమగుచున్నది. (ఎడ్మండుబర్కు ఉపన్యాసము)

దేశము లిన్నిమార్పులు సెందినను కులాచారము లేమాత్రమేని తొణకకుండుటయె వానియందుఁగల నిర్దోషత్వమును, అనపాయత్వమును వేనోళ్లఁ జాటుచుండలేదా?

ఇట్టి కులాచారధర్మముల ననుభవించుచునే ఎన్నో వేలకువేలయేండ్లనుండి యనాదిగా వచ్చు ధర్మాచారములం దీనాఁటి కేమితప్పు కనుపడినందున ఈశాసనమున కావశ్యకము జనించెనో తెలియదు. క్రైస్తవుదార (హోము మెంబరు) పాశ్చాత్యదేశములలో విలంబిత వివాహములవల్ల వచ్చు కడుపుకోఁతచేటు నెఱుంగలేకనో యెటిం

గియు చెప్పఁకొనలేకనో "హిందువులలో బాల్యవివాహము" "క్రోఁత చేటు" (Corroding evil) అని పలుకఁగలిగిరి. ఇట్లు పరంపరానుగతములైన యనాదిధర్మములవలంబించి చరించుచుండుటచేతనే మనదేశమునందు జాతి కొక పవిత్రవ్యక్తిత్వము జనించినది. ఇట్టి వ్యక్తిత్వమువల్ల తమతమ కులాచారధర్మముల నవలంబించుకొనుచు వచ్చిన బ్రాహ్మణాదిజాతులు తమ విజ్ఞానవికాసము నీనాఁటికింగూడ ఇంగువ గట్టిన గుడ్డలవలెనైనను తద్వాసనాలేశమేని కాపాడుకొనఁగలిగిరి. ఇన్నివేలసంవత్సరములనుండి యాచరింపఁబడుచు వచ్చిన బాల్యవివాహములం దేనాఁడేనియు నెవ్వరేనియు నొక్క యాక్షేపణగాని యనర్థమునుగాని చూపించఁగలిగిరా? వేయేల.

It may be with safety assumed that when millions of intelligent people practise certain customs for thousands of years, there must be something in those customs to redeem them from the charge of folly or crimnality."

"*Fredric Pincott.*"

......It is certain that the whole religious and social system of the Hindus is the outcome of centuries of profound thought and carefully recorded experience,......These wise provisions have stood the tests of centuries and by their results continue to proclaim their excellence. All parties are united in the opinion that Hindu married life is an exceptionally happy state,—and this is the clearest proof of the excellence of the system and the severest condemnation of those that are seeking to unsettle it.

*Fredric Pincott in Rationale of Early Marriage.*"

(విజ్ఞానసంపన్నులైన కోటానుకోట్లజనులు వేలకొలంది సంవత్సరము లొక యాచార మవలంబించఁగలిగినప్పుడు, అట్టి యాచారములలో నేమాత్రమేని యపరాధములు నేరములు లేవని మనము చక్కఁగా నిర్ణయింపవచ్చును.

ఎన్నెన్నియో శతాబ్దములు తామాలోచించి యవలోడించి, తమతమ యనుభవములవల్లఁ బరీక్షించి, క్షేమకరములని నిర్ణయించిన పద్ధతులే హిందువుల సంఘమర్యాదలుగను మతాచారములుగను పరిణమించిన వని చెప్పుట కేమియు సందేహము లేదు.

ఈ చక్కని యాచారములు మర్యాదలు చాలశతాబ్దములవారిచే పరీక్షింపఁబడి వారిపరీక్షఘాకను నిలువరించఁగలిగినవి; అట్టి యాచారములవల్ల ఫలించిన ఫలితములే వాటిలోఁగల శ్రేష్ఠత్వమును వేనోళ్ల చాటుచున్నవి.

హిందూదేశములోని వివాహపద్ధతులు కడుశ్రేష్ఠములైన వగుటచే నొకానొక
త్తరమగు సాంసారిక సుఖస్థితికి మూలకారణములైనట్లు అన్నిపక్షములవారును
ివముగా నభిప్రాయపడుచున్నారు. ఇయ్యదియొక్కటియే చాలును వారిపద్ధ
శ్రేష్ఠత్వమును ప్రకటించుటకు ప్రబలప్రమాణమైయున్నది. అట్టి వివాహపద్ధ
ు దలక్రిందుసేయ సాహసించువారియొక్క దౌర్జన్యమును ఖండించుటకుఁగూడ
ు ముఖ్యసాధన మగుచున్నది.) "ఫ్రెడరిక్ పింకాటుదార వ్రాసినది"

ఇట్టి యభిప్రాయములవల్ల తేలుచున్న విషయ మేమనఁగా,
ుకులాచారధర్మములనాదులై యాచరింపఁబడుచు, సర్వదేశక్షోభ
దండయాత్రలు, విప్లవములు మున్నగువాని ధాటికి నిలువరించఁ
గియుండెనో ఆయాచారములు నిర్దుష్టము లనువిషయము స్వతః
మగుటయేకాక అట్టి యాచారములు అనపాయములగుటంజేసియే
ంజీవులై యున్నవనియుఁగూడఁ దేలుచున్నది. కావుననే పురాత
ులగు నాచారముల రద్దుపఱిచి "లోన లొటారం బయట బటా
ు" లగు నితరులసిద్ధాంతముల నందులకు బదులుగాఁ జొన్పించుట
ర్మార్గమని పాశ్చాత్యులే ప్రకటించుచున్నారు. లేనియెడల ముల్లున్న
త్రీయఁబోయి కొట్టుడచినవిధముగాఁ బరిణమించును.

Any introduction among them (Hindus) of our crude ideas
only result in mischief and tend to bring the Hindus to the
ne chaotic scramble of antogonistic interest which is the
racteristic of our own disgraceful social muddle.
(*F. Pincot*) "*The Tribunal of Common Sense*" *Page*3.)

ముతకపాఱి మోటువడ్డ మనపద్ధతులను హిందువుల కులాచారములందుఁ
రఁబెట్టించితిమేని మితిమీఱిన యనర్థములకు కారణములగుచున్నవి. మనసంఘ
ులోపల నిండియుండి స్వాభావికమగు మడ్డితనమును జూపునట్టి పరస్పర వైర
రణములగు గందరగోళములకే హిందూసంఘమును గూడ దించివేయఁ గలిగి
ున్నవి. ("యఫ్ పింకాటుదార వ్రాసినది.")

చదువరులారా! చూచితిరా? మాసంఘమునుజూచి మా
వాహపద్ధతులఁజూచి భ్రమపడి చెడిపోవద్దని పాశ్చాత్యులే హెచ్చ
ుచుచుండ మనము వారిపద్ధతుల శాసనరూపములుగా శిక్షావిధాన
ులతో సహాగా దేశములలోనికి దించి జాతిసంక్షోభమొనర్చు చట్ట
ులఁ బ్రవేశింపఁబెట్టించి ఆర్యకుటుంబములను గగ్గోలుపఱిపించు క్షేమి
ుసాహసమో మీరే యాలోచించుకొనుండు.

దుర్మార్గమునకు "ఫరవాలేదు తప్పు లే"దని దురూహ జనించుచున్నది. కొన్ని దేశములలో నాఁడుది వీధియందుఁ బోవునపుడు కోడెగాండ్రిటు నటు గుంజుచుందురట! ఆయూఁడుదే యొకనిసొత్తుగా నున్నయెడల పరు లట్లు చెనకఁగలరా? చెనకఁజాలరు. అట్లుగాక బాల్యవివాహములవల్ల స్త్రీయొక్కనిసొమ్ముగా చిన్ననాఁడే యేర్పడుటచే మన దేశమున కెట్టిమంచిదశ కలిగినదో చక్కఁగా గమనించుఁడు.

It is a rule of Indian manners that women should pass unnoticed and unremarked even in the household of a friend and except perhaps among the lowest ruffians there is none who would offend the modesty of woman even by a gesture or unseemly recognition. They can pass in the midst of crowds without molestation and insult. For the woman in India have raised an ideal lofty and selfless for all to behold.

*Otto Rothfield "Women of India."*

బంధువులయొక్కయు స్నేహితులయొక్కయు నిండ్లలో సైతము ఆఁడువారు వెళ్లినప్పుడు మగవారు తేరిచూచుట ఆక్షేపించుట మొదలగు పనులు జరుగకుండునట్లు సేయుచుండుట హిందువులలో సత్ప్రవర్తన లక్షణమై యొప్పుచున్నది. ఎచ్చటనో దుర్మార్గులజట్టులోఁ దక్క ఆఁడుదానికై కనుసైఁగ చేయుటగాని, వెకిలితనముగా తలయూఁచుట గాని జరిపి స్త్రీలసిగ్గునకు హాని కల్గించువారు ప్రాయికముగా లేనేలేరు. ఎంతజనసమ్మర్దములోనైనను వారు ఏవిధమైన యొత్తిడి లేకుండనే సాగిపోవువీలులు చాల కలవు. దీనికంతకుఁ గారణ మేమనఁగా హిందూదేశములోని స్త్రీలు తమ సద్గుణసంపదలచే చూచువారికెల్ల నహంకారరహిత మైనట్టియు మహోన్నతమైనట్టియు నొకానొక ఆదర్శరాజమును చక్కఁగాఁ బోషించుచున్నారు.

(ఇండియాలో స్త్రీలు) "ఓటోరాథఫిలుడు" వ్రాసినది.

కావుననే కాళిదాసాదిమహాకవులు పంచదారపలుకులతో "అనిర్వర్ణనీయం పరకళత్రం" అని శాసించుచున్నారు.

ఇంతయేల ? పర స్త్రీ వచ్చినప్పుడు మగవాఁడు పవళించియుండఁగూడదనుధర్మ మెంత సునిశితముగా నున్నదో చూడుఁడు. ఈయభిప్రాయమును కుశమహారాజునకు అయోధ్యాధిష్ఠాన దేవత కన్పించినప్పుడు "పూర్వార్ధవిస్పృష్టతల్పః. యనికాళిదాసు. కుశుని

వర్ణించియున్నట్లు మన మెఱుంగుదుము. స్త్రీలను తామే గౌరవించు చుంటి మనియు హైందవు లాఁడువారిని బానిసీలఁగాఁవించియున్నా రనియు చాటుకొను ఆత్మస్తుతి పరనిందా పండితులు కొందఱు పాశ్చాత్యులు వ్రాసిన వ్రాతలు వారియజ్ఞానతాండవమునే నిరూపించుచున్నవి, వాస్తవమదిగో వినుండు:—

In no nation of antiquity were woman held in so much esteem as the Hindus. *Prof. H. H. Wilson.*

ప్రసిద్ధిచెందిన ప్రాచీనరాజ్యము లెందెచ్చోటంగూడ హిందువులలోవలె స్త్రీలను చక్కనిగౌరవముతో పాలించుజాతి యింకొకటి కానరాదు.

ప్రొఫెసర్ విల్సన్‌దొరగారు.

Sir George Birdwood in the Asiatic Quarterly Review.

Perfect daughters, wives and mothers, after the severely disciplined and self-sacrificing Hindu ideal, remaining modestly at home as the proper share of their duties, unknown beyond their families, and seeking in the happiness of their children, their greatest pleasure, and in the reverence of their husbands the amaranthine crown of a woman's truest glory.

హిందూయువతులు సమగ్రలగు కుమారితలు, సంపూర్ణలగు భార్యలు, ప్రసిద్ధి వడసిన తల్లులు. స్వార్థపరిత్యాగగుణముతో నిండి చక్కని నడవడికవలన సుశిక్షితలైనవారు. హిందూ ఆదర్శపద్ధతుల ప్రకారము ప్రవర్తించునట్టివారు. గృహకృత్యములందే వ్యగ్రలై చక్కగా నిర్వర్తించుకొనుచు నింటనే యుండువారు. వారి కాఁపురములలోపల దక్క బయటి కగపడనివారు.

ఇంతియుతికాక వారు తమసమస్త సుఖములను సర్వానందములను తమసంతానములందే కాంచుచుండెడివారు. వారు తమభర్తల కిచ్చుగౌరవమునందే యానందించుచు నెన్నఁడు వాడిపోని నారీమణులకు భూషణమునగు కీర్తికిరీటమును, వాస్తవముగా ధరించుచున్నారు.

ఇంతియకాక (Sir Thomes munroe) సర్ థామస్ మనురో దొర యీవిధముగా వ్రాయుచున్నాఁడు:—

(Indian women) their state is not one of slaves to their husbands. They have as much influence in their families as, I imagine, the women have in this country.

హిందూదేశములో నారీమణులస్థితి భర్తకు బానిసతన మనుకొనుట తప్పు.

నదేశములో స్త్రీల కున్నటువంటి స్వతంత్రత వారివారి కుటుంబములలో హైందవ
ారీమణులకుంగూడ కలదని నేను తలంచుచున్నాను.

ఇట్టిగౌరవము బాల్యవివాహ సామరస్యమువల్ల జనించిన ఫలి
ము, మనదేశమునందుంగల యీ యద్భుత నారీజనరక్షను గుఱించి
ాశ్చాత్యులు వింతపడుచున్నారు. వారి (East End) తూర్పు కొన
థులలో జరుగు నాటకములు తందనాలు బలాత్కారములుచూచిన
నదేశములోని సంగతులు వారికి విచిత్రముగా తోంచకమానవు.
ాదర్ అబ్బి డూబోయి (Father Abbe Dubois) దొరతన గూర్చి
్యము పట్టంజాలక యిట్లు వ్రాయుచున్నాండు:—

The person of a woman is sacred. She cannot be touched n public by a man even with the ends of his fingers. However bject may be her condition, she is never addressed by nybody not excepting the persons of the highest rank but under he respectful name of mother. A dwelling in which only emales are to be found, even the hut of the most helpless widow, s an invoilable asylum into which the most determined liberties would dare to penetrate or should he do it his audacity would not remain unpunished. A woman can frequent the most crowded part without being exposed to the least insult. A male who would stop merely to gaze at a female who is passing by, as our oungers in Europe are accustomed to do would be considered by all as an insolent and uneducated person."

*Quoted in the "Tribunal of Common Sense" Page* 3.

ఆండుదానిశరీర మతిపవిత్రముగా నెన్నంబడుచున్నది. ఆమె నెవ్వరును బహిరంగముగా మునిగోటనైనను స్పృశించజాలరు. ఆమె యెంత బీదరాలైనను పెద్దవారుదప్ప నెవ్వరును, ఆమెను పిలువంగూడదు. ఆపిలుచుటకూడ "అమ్మా" యని పిలువవలయును, ఏయింటనైనను, ఆడువారుమాత్రమే యున్నప్పటికిని, చివర కెంతనిరాధారపు విధవస్త్రీ యున్నప్పటికిని అట్టియిల్లు ఎట్టితులువలకుగూడ నంద రాని రక్షామందిరమై తనరారుచున్నది. అందెంత పోగరెక్కినకోడెకాండైనను చొరంబడంజాలడు. అట్లు చొరంబడెనా శిక్షింపంబడక తప్పించుకొని పోలేండు. ఏవిధమైన నలుగుబాటు లేకుండనే యేస్త్రీయైనను ఎంతజనసమ్మర్ద మున్నచోట నైనను నిరాఘాటముగా సురక్షితముగా నడచిపోంగలదు. దారినం బోవు ఆండు దానివంక తేఱిపాఱంజూడ నుంకించు యేమగవాండైనను- (మనయూరోపులో నట్టి సోమారిపోతు లెందఱో కలరు-) నాగరకత నెఱుంగని తుంటరిగా ప్రజలచే నెన్నంబడు చున్నాండు.

(బి). పాతివ్రత్యము.

బాల్యవివాహములవల్ల స్త్రీలలో పాతివ్రత్యగుణము వర్ధిల్లఁగల దనియు, దానివల్ల సంఘము బ్రహ్మానంద వారాశి నోలలాడఁగలదనియుఁ గూడ నితరవిషయములు చాలవఱ కిదివఱకే చర్చించియున్నాను. ఐర్లండు కాపువారిలో బాల్యవివాహములవల్ల పాతివ్రత్యము మిక్కిలి గాఁ గన్పట్టుచున్నట్లు 20 పుటలో మే మిదివఱకే నిరూపించియుంటిమి.

The women of the East are not so much in evidence as those of Europe but their influence within the legitimate circle of their domestic relations is as great, their manners are as good and their morality is as high.

Those who know most of the results of this freedom of women in the west—may well doubt whether the occidental or oriental method of treating the fair sex is more in accord with practical wisdom.

*Sir Lepel Griffin in the "Rationale of Early Marriage."*

ప్రతీచీనారీమణులవలె ప్రాచీదేశనారీమణు లంత సమానలు గారుగాని వారి యధికారము జరగవలసినచోట నధికారము వహించుటయందును వారిప్రవర్తన యందును వారి పాతివ్రత్యమునందును అంతగొప్ప వారుగానే పరఁగుచున్నారు.

ప్రాచీప్రతీచీదేశములలో స్త్రీల కియ్యఁబడు స్వాతంత్ర్యమును పోల్చిచూచిన చో తత్ఫలితముల నరసినచో ప్రతీచీజాతులలోకంటె స్త్రీలను నడిపించుపని ప్రాచీదేశములలోనే మరింత నాగరకతా విజ్ఞానసంపన్నముగా గన్పట్టుచున్నది.

సర్ లెపెల్ గ్రిఫిన్‌దొర.

దీనివల్ల బాల్యవివాహములు పాతివ్రత్యమున కాధారము లగు ననియుఁగూడ ధ్రువపడినది. ఇట్టి పాతివ్రత్యమే సంఘశుద్ధికి కారణమై, ప్రాపంచికసుఖమున కాలవాలమై, జాత్యభివృద్ధికి హేతుభూతమై, దాంపత్యమునకు ముఖ్యాధారమై, సకలశ్రేయములకు నిదానమని తేలుచుండఁగా నీ నడుమంత్రపుచట్టమున కావంతయేని నవకాశము లేదు.

(సి) సంసారసుఖము.

బాల్యములోనే పెండ్లాడిన కన్నెల కెనిమిదేండ్లనుండి స్వాభావికముగా నుదయించు ప్రేమానురాగము లొక్కయెడ నాటించి పోషిం

చువచ్చి యీడేరినవెంటనే తదనురాగఫలముల భుజించుటయే సారసుఖలక్షణము గాని యీడుముదిరినతర్వాతఁ బెండ్లాడఁగోరి వేళకు తమకంటఁబడ్డవానిపై అప్పటికి మనస్సు నిలిపితరువాత ర కాలము అట్లేవానియందు నిలుపఁజాలక దుర్గతులకుఁ బాలై మెరికామున్నగు దేశములవలె భర్తను ౧3 తడవలు మార్చుకొను వతులకు సంసారసుఖ మేమికలదు? ఏమగనికిఁగన్నసంతాన మండువాలో పాఱవేయు టేమి సంసారసుఖము?

మేరీస్టోప్సు (Marie Stopes) నిర్ణయించినట్లు చిన్నతనములోనే ండ్లాడి దినదినప్రవర్ధమానముగా ననురాగముల వృద్ధిసేసికొనుచు క్రమముగా సంసారసుఖ మనుభవించుటయే మంచిదని యీవిష యమును గుర్తెఱింగినవా రందఱకునుగూడఁ దెలియఁగలదు. దీనివల్ల ప్పనిసరిగా బాల్యవివాహములే సర్వానర్థనివారణ సాధనములుగా కు తోఁచుచున్నది.

It is not good for man—or woman either—to live alone. I n sure. And one tendency of times which I am inclined is ie apparently increasing avoidence of marriage or its postpone- ient until an age when the adaptation of one individual of the uple to the other is difficult, because habits have become so xed firmly that their adjustment is a difficult or at least an inoying process. Obviously therefore it seems to me that early iarriages should be encouraged.

*Mr. Alva Edison* (*Page* 80) *from* " *Weekly Despatch.*"

మగవానికిఁగాని ఆఁడుదానికిగాని యవివాహితదశలో జీవించుటలో శేమాత్రము క్షేమశ్రేయములు లేవు. ఇది నానిశ్చయము ప్రస్తుత కాలస్వభావములు వాహమునుండి తప్పించుకొను నుపాయములు వివాహములు ముదురువయస్సుదాఁక రిపియుంచుటలు, ప్రాయికముగా విచ్చలవిడిగా సంభవించుచున్నవి. అట్లు వివా మున కీడుముదిరినవఱకు జరిపియుంచితిమేని భార్యాభర్తల స్వభావగుణములు క్కగా గిటసఁబాఱి యొకదాని కొకటి యతకజాల కుండుటయు, అట్లతికించుట లకాయనొప్పి పనిగా పరిణమించుటయు తటస్థించుచున్నది. దీనివల్ల తప్పనిసరిగా ాల్యవివాహములే సర్వానర్థనివారణ సాధనములుగా నాకు తోఁచుచున్నది.

వివాహధర్మములు సంసారసుఖాధారము లగుటకు బాల్యవివా హములే సమర్థములని యీక్రిందియభిప్రాయము తేటఁబరుపఁగలదు.

In general it may be said that the Hindu rules of marriage are in the ordinary sense of happiness as conducive to the happiness of the spouses as the fast transforming systems of modern Europe and their happiness is less self-centred and more altruistic. The worth of a nation's womanhood can best be estimated by the completeness with which they fulfil the inspirations of love and its devotion and judged by this standard, the higher types in India need fear no comparison.

" *Women of India*" *by Otto Rothfield.*

సాధారణముగా హిందువులలోఁగల వివాహపద్ధతులు సాంసారికసుఖమును దంపతులకొసంగుటలో చాలాసమర్థము లని చెప్పకతప్పదు. నిముషనిముషమునకు మాఱిమాఱి యిప్పటియూరోపులో గన్పట్టుచున్న వివాహపద్ధతులేవిధమైన దాంపత్య సౌఖ్యము నొసఁగఁజాలవు. హైందవులలో సాంసారికసుఖము స్వార్థపరిత్యాగగుణపరిపూర్ణము. పరశ్రేయోదాయక ధర్మగుణశోభితముగాఁ బరఁగుచున్నది. ఏదేశములోనైనను స్త్రీజాతియొక్క సాఫల్యము వారు భర్తలయెడఁ జూపు సంపూర్ణానురాగముపై నాధారపడియున్నది. ఈపరీక్షనుబట్టి గమనించినచో హిందూదేశములోని యగ్రజాతిస్త్రీలతో సరితూఁగువారే దేశమునందును సాటికి రాఁజాలరు. (ఇండియాలోని స్త్రీలు (ఆటోరాధఫీలుడు.)

ఈ బాల్యవివాహములవలన స్త్రీలకు ఉన్నతవిద్యను బడయుటకు అవకాశములు తగ్గిపోవుచున్నవనియు, ౨ బాలవిధవలసంఖ్య పెఱుగుచున్నదనియు కొందఱి వాదమయియున్నది.

ఇంగ్లీషు చదువు చదివిన పురుషులలో అధిక సంఖ్యగలవారు సర్వవిధముల మతాచారాదులందు చెడియే యున్నారనుటకు లార్డు మెకాలేగారి వ్రాతయే మనకు సాక్షి. (చూ. ౯[illegible] పుట) ఇంతవఱకు మన మీ భరతఖండమున గల నలుగురిలో తలయెత్తుకొని తిరుగజాలుట భారత స్త్రీరత్నములయొక్క సత్ప్రవర్తన బలముచేతనే సుమీ. సర్. ఆండ్రూ వింగేటు దొరగారిట్లు వ్రాయుచున్నారు:—

I belive the men of India would have long ago been last had it not been for the noble womanhood of India.

ఇండియాయందు గల భారతీయాంగనలయొక్క పాతివ్రత్య బలమే లేనియెడల భారతీయులగు పురుషు లిదివఱకే నశించియుందురు.

ఆంధ్రవాల్మీకి బిరుదాంకితులున్నూ, తపస్వియునగు వావిలికొలను సుబ్బారావుగారేమనుచున్నారో తిలకింపుడు:—బుద్ధిలేని పురుషులు వారికిన్ని (స్త్రీలకున్నూ) దురాచారములు నేర్పి వారిని భ్రష్టులఁ జేయుచున్నారు.

## ఉన్నతవిద్యయు, సమాధానము.

స్థితిగతులిట్లుండ ఖండాంతరములందు పురుషులతోపాటు స్త్రీలు కూడా స్వేచ్ఛగా జనువుటకు అవకాశములున్నవి కనుక ఆయవకాశము నే మనయిండియాయందు కూడా స్త్రీజాతికి కలుగఁజేయవలయు ననియే వీరియభిప్రాయముకాని అట్టి విద్యావిధానమువలన ఆదర్శభూతలగు స్త్రీరత్నములు వారి సంఘమునందు యేర్పడుచున్నారని యెవ్వరును చెప్పుటలేదు. మీదుమిక్కిలి యీవిద్యావిధానమువలన స్త్రీజాతికి అలంకారభూతముగా తలంపబడుచున్న స్వార్థరాహిత్యము, కుటుంబప్రేమ, పెద్దలయందు అణకువ మున్నగు సుగుణములు సమూలముగ నశించుచున్నవని పాశ్చాత్యులే ఘోషించుచున్నారు. హారియట్ అను విదుషీమణి యేమనివ్రాయుచున్నదో చూడుడు:—

what is higher education doing for our own girls? It is producing a class of women who frankly own they want to live away from their parents 'own their own' They detest house work, can't be batherd with children, and 'old People', bore them They want to live their own life, as they term. They might truth ully add their own selfish lives'.

ఉన్నతవిద్య మనపిల్లలకేమి చేయుచున్నది? ఈవిద్యావిధానము తల్లితండ్రుల నుండియు తమవారినుండియు దూరముగా నుండగోరుచున్నామని బహిరంగముగా మనపిల్లలచేతనే చెప్పించుచున్నది. వీరికి గృహకృత్యములన్న అసహ్యములు, సంతానమునుగనుట గిట్టదు. కుటుంబములోని పెద్దలమాటయన్న అసలేగిట్టదు. కేవలము స్వార్థపరమగు జీవితమునే వీరు గడుపుకొనదలంచుచుందురు.

పై విదుషీమణి యారోపులో ఉన్నతవిద్యనభ్యసించిన స్త్రీల సాంఘికజీవితమును గూర్చి చిత్రించియున్నదిగాని ఇండియాయందలి ఈపాశవిక విద్యావిధానమునందు తీర్ణలయిన భారతీయాంగనలుకూడ పై పాశ్చాత్యాంగనలకంటె యేవిషయమునందున్నూ తక్కువగా నుండలేదనియును, సూక్ష్మముగా విచారించిన కొన్నివిషయములందు వారికంటె ఎక్కువగానే యున్నారనియును నవనాగరక స్త్రీరత్నములలో పలువురుఇప్పుడుచేయుచున్న వివాహవిచ్ఛేద శాసనము నలభిషించుట మున్నగు ఆందోళనాదులవలన మనము గ్రహింపవచ్చును.

## బాల్యవివాహము. విధవలసంఖ్య.

బాల్యవివాహమువలన బాలికలు సుమంగళి స్త్రీలు అయ్యెదరు కాని విధవరాండ్రెన్నటికిని కాజాలరు. వివాహ మొనర్చుకొన్న పురుషుడు గతించినయెడల విధవలయ్యెదరు. ౧౮ సం తర్వాత వివాహము చేసినయెడల భర్తమరణించడని ఏశాసనసభవారుగాని గారంటీచేయఁ జాలరు కావున వివాహము నే చేసుకొనఁగూడదని శాసించిన ఈదురవస్థ తొలగును. విధవయనుమాట నే నిఘంటవునుండి కూడా తీసివేయవచ్చును కావున మా శాసన సభ్యులున్నూ సంస్కర్తలున్నూ తత్ప్రియత్నము నొనర్తురుగాక. బాల్యవివాహముల నాచరించు సాంప్రదాయముగల 22 కోట్ల హిందూజనసంఖ్యలో 24 లక్షలసంఖ్యగల విధవలుండగాఁ (అనగా నూటికి 6 రుమాత్రమే) బాల్యవివాహముల నాచరించని సాంప్రదాయముగల 4 కోట్లజనసంఖ్యగల ఇంగ్లాండులో 60 లక్షల సంఖ్యగల అవివాహిత స్త్రీలు (అనఁగా నూటికి 16 రు చొప్పున) తమ దుఃఖమయమయినజీవయాత్రను గడుపుచున్నారు కనుక మీరు చెప్పెడి సమపాయమువలన ఇంతకు ౨౦ రెట్లు సంఖ్యగల అవివాహితలగు స్త్రీలు ఈభరతఖండమునం దేర్పడవచ్చును గాని వేరు లాభమేమియు ఈశాసనమువలన గలుగఁజాలదు.

ఈసందర్భమువల్ల బాల్యవివాహమే సర్వవిధముల క్షేమకరమని పర్యవసానమున తేలుచుండ నీవెర్రిశాసనమున కేవిధమైన యవసరము కనుపడునా? పనిలేక పిల్లికి పంగనామములఁ బెట్టినట్లు సామ్రాజ్య సంఘసభ్యు లింక ఎన్నెన్నిచట్టములు దెచ్చిపెట్టెదరో? "వివాహ విచ్ఛేద శాసనము"ను మూసలో వేసినట్లు చదివితిమిక దా రానిండు. ఈ కలిప్రవాహ మెచటికి మనసంఘము నీడ్చుకొనిపోఁగలదో చూతము.

శా॥ కాళుల్ గడ్డముఁ బట్టి "వోట్లు" గొని బాగా నెత్తిపై కెక్కి ధ
ర్మాలన్ గంటిడి దుంప దెంచి రిది యేలా పిల్లికిం బంగనా
మాలన్ బెట్టెడి యీసభాసదులు బ్రాహ్మణ్యంబుఁ జెండాడ నీ
లీలన్ రేఁగిరికొం టెచట్టముల నిర్మింపంగ నింకెంత లే
మూలన్ దాఁచిరొ సంఘ మెట్టివిషమాంభోధిన్ బడంద్రోతురో?

భగవంతునకే యెఱుక. భావిపరిస్థితుల్లు మానవుని యూహా ప్రపంచమును దాఁటిపోయినట్లు తోఁచుచున్నవి.

# బాల్యవివాహతత్త్వసారము

## ఆఱవయధ్యాయము

### హేతుమాలిక – ఉపసంహారము

ఈగ్రంథము నింతటితోఁ బరిసమాప్తిఁ గావించెదను. ఏతత్స్వామే ముఖ్యమగు నొకచిన్న సమాచారము వివరించవలసి యున్నది. ఇంగ్లీషుపత్రిక లీశాసనము నామోదించుచు నీచట్టమును సర్కారువారే ప్రవేశపెట్టిన హేయమగుననియు, ఏలయన సాంఘిక విషయములను శాసించుటకు సర్కారున కధికారము లేదనియు ఈచట్టము ప్రజాప్రతినిధులవల్ల ప్రవేశపెట్టఁబడుటచే సర్కారువారు సంఘకల్లోలముగా పాక్షిత్వము వహించిరను నింద కర్హము కాజాలరనియు బ్రకటించుచున్నారు. ఈచట్టమును శారదాగారు ప్రవేశపెట్టుట స్వబుద్ధిజనితమో లేక యెవరి ప్రోత్సాహముచేతనైన చేసిరో భగవంతునికే యెఱుక. కాని చట్టమును ప్రజాప్రతినిధులవోట్లకే పూర్తిగా విడువక గవర్నమెంటువారు తమ సమ్మతిని ముందుగా ప్రకటించి వారి యనుగ్రహమున కాసపడువారి వోట్లను మున్ముందె గడించి, కేవలము సర్కారు బలముతోనే యీచట్టమును నెగ్గించిరే గాని ప్రజాప్రతినిధులకు విడిచినచో చట్టము నేలకూలిపోయియుండెడిదే. ఈచట్టమునకు 27 మంది అనుకూలురు (15 + 14) 29 మంది ప్రతికూలురు. (సభలోనిల్చి ప్రతికూలపు వోట్లిచ్చినవారు 14 మంది. బయటికి నడచినవారు (Walk outs) 15 మంది కలరు) శాసనముగతి అధోగతియే అయ్యెడిదే!

ఇది యిట్లుండ ప్రజాప్రతినిధులు రాజ్యాంగతంత్ర నిర్వహణమునకు పంపబడిన ప్రతినిధులేగాని మతములను తలక్రిందుసేయఁ బంపబడిన ప్రతినిధులుగారు. మతవిషయములను నిర్ణయింపఁ బ్రతినిధులఁ బంపుదన్న మతజ్ఞానముగల పీఠాధిపతుల నెన్నుకొనియుండమా? ఈకాలమునందు రాజ్యాంగసభ కెన్నుకొనబడినవారందఱు నింగ్లీషుభాషావేత్తలే. ఈ

ఇంగ్లీషుచదువుకొన్నవారికి మతమక్కరలేదు. ఈవిషయమై చరిత్రకారులుగూడ నింగ్లీషుచదువుతో స్వకీయమతాచారకులాచారధర్మము లస్తమింపఁగలవనియే తలంచుచున్నారు. (Lord Macaulay) లార్డ్ మెకాలేదొరవా రెట్లు తలంచుచున్నారో వినుండు:—

"No Hindu who has received English education ever remains sincerely attached to his relegion, Some continue to profess it as a matter of policy but others profess themselves pureilistic and some embrace christianity"

ఇంగ్లీషు విద్య నభ్యసించిన ప్రతి హైందవుఁడుగూడ తన మతాచారములకు తిన్నగా బద్ధుఁడైయుండజాలడు. కొంతమంది యేదో అయినట్లు పోయినట్లుగా లోకమునకు వెఱచి మతమునందు నామమాత్రముగా నిల్చియుందురు. కొందఱు తామెటు నేయజాలక యేప్రక్కకు త్రొగ్గతిలంబడక గోడమీద పిల్లివాటువలె సంచరించుచుందురు. మఱియు కొందఱు ఏకాయెకీని కిరస్తానిమతమును పుచ్చుకొనుచుందురు.

(లార్డు మెకాలేగారి వాక్యము)

కావున నింగ్లీషు చదువుకొన్నవారిని మతవిషయిక చట్టములను బుట్టించుటకుఁగాని పెట్టించుటకుఁగాని ప్రజలేమాత్ర మెన్నుకొనియుండ లేదనుట నిర్వివాదము. 'మద్రాసుమెయిల్' (Madras Mail)పత్రిక యీ శాసనమునకు కారకులైన సభ్యులను సంస్కర్తలనుగూర్చి యీవిధముగా మందలించుచు బుద్ధిచెప్పుచున్నది:—.

"Our purpose is to point out the danger that a similar indifference to the sanctity of things venerated, may tomorrow produce results abhorrent even to the reformers of to-day"

MADRAS MAIL (Leader Article) 25th Sept: 1929.

పరంపరానుగతముగా ఆచరింపబడుచున్న యాచారములలోగల పవిత్రత్వము నెడల నీనాఁటి సంస్కర్తలు గొప్ప యనాదరణను తిరస్కారమును జూపినంతనేమాయె. అట్టి సంస్కర్తలకే రేపోమాపో వారికే చేదుగా వెగటుగానున్న దుష్ఫలితము లుదయించినప్పుడు తల దిరిగి రాకతప్పదు. ఈ మహాపాయము నీనాఁటికి సంస్కర్తలకుఁ జూపించి వారిని మందలించుటతో మాబాధ్యత నెరవేర్చినవారమగుచున్నాము.

మద్రాసుమెయిలు (లీడరు) 25-9-29.

కానిండింకను విపరీతచట్టము లెన్నెన్ని యీ మూసలోఁ బ్రాఁగుచున్నవి. సంఘముపై సంపూర్ణముగ దాడి సాగించియున్నారు. ఇంక విపరీతచట్టముల కేమికొఱంత?

౨. జనులీ నీరస శాలిభోజనముచే సంప్రాప్తదార్శ్యుల్యులై
వనటం గుంది నశింప దేశబల మల్పం బౌనటం చెంచి వెం
టనె మాంసంబు భుజింప చట్టమిడి నోట్లం గండలం బెట్టి క్రు
క్కిన దిక్కెవ్వరు వెట్టిశాసనము లింకెన్నెన్ని రానున్నవో?

క్రోడీకృత హేతుమాలిక

ఈ గ్రంథమునం దింతవరకు నేను వ్రాసిన హేతుజాలముల నన్నిం
టి నిచట సీసమాలికారూపమున క్రోడీకరించి వ్రాసి చూపెదను:—

సీసమాలిక

(౧) బాల్యవివాహముల్ పరగుజాతులయందు
లలిత పాతివ్రత్య మలరియుంట,

(విర్లండు కాపులలోవలెనే యేజాతిలోనైనను బాల్యవివాహములు పాతివ్రత్య
మునకుం గారణభూతములని శాస్త్రవేత్త లంగీకరించియున్నారు.) పుట–20

(౨) చిఱుతనాఁడే పెండ్లిచేసినచోఁ బూర్ణ
దాంపత్యసుఖములు దనరియుంట,

(పిన్నవయసులోఁ బెండ్లిండ్లు గావించినయెడల ప్రేమ దినదిన ప్రవర్ధమానముగా
గల్గి వ్యక్తియందే పెఱిగి యనుకూలదాంపత్యమునకు కారణ మగుచున్నది—) ౧–

(3) ముదురుపెండ్లిండ్లలోఁ బొదలు దాంపత్య వి
చ్ఛేదంబు లిచ్చోటఁ జెలఁగకుంట,

(విలంబితవివాహములు ఎండినగోడువలె నతుకక కొలదిరోజులకే విడుదలలకుం
బగిలియుండుట తటస్థించును. అట్టిదుర్దశ బాల్యవివాహములం దుండజాలదు.) పుట– 14.

(౪) ఈడేరఁగనె భర్తఁ గూడుభాగ్యం బంది
పావనశిశుజన్మఁ బడయుచుంట,

(కన్నలీడేరఁగనే కామోదయమగునుగాన ఆనాఁటికి మగనిఁ దడవుకోనకుండనే
సంసిద్ధముగానున్నచో వేరుదారినిబోకుండ సుఖించి పావనమగు సంతతిని బడయగల్గి
యున్నారు) పుట– 1.

(౫) హెచ్చుతగ్గు లెఱుంగ కేకరీతి సుఖించు
తల్లి కాయుస్సు వర్ధిల్లుచుంట,

(అకస్మాత్తుగ పెండ్లిండ్లలో గల యవస్థాభేదము లెఱుంగకయె స్త్రీలు దయభర్త
లతో సుఖించుచు తల్లులై చిరకాలము జీవించుటకుఁదగు నవకాశముగలదు) పుట–19.

(౬) కన్నెనాఁటనె భర్తకై రాగమును బెంచఁ
ప్రేమకు నిలుకడ వెలయుచుంట,

(చిన్నతనమునుండియు నొకనియందు ప్రేమ నిల్పి యభ్యసింపుటచేత యువతుల ప్రేమకుఁ జక్కని స్థైర్య మలవడగలదనుట నిర్వివాదాంశము) పుట—18

(౭) ఈడేరకయమున్దు పాడిమైఁ బతి నంది
మానరక్షణసిద్ధిఁ బూనియుంట,

(ఈడు రాకపూర్వమే తానొక్కని సొమ్మైకన్నెయుండె నేని యామెకు అభిమానము, ఆమెపై నభిమానము వధూవరులలో మానసంరక్షణమునకు హేతువగుచున్నది) పుట.

(౮) పితరులు బంధుగుల్ వెదకి వేసారి చ
క్కనిభర్త సమకూర్పఁ గల్గియుంట,

(అందఱు కడుశ్రద్ధతో వెదకి కన్నెకు చక్కని భర్తనుగూర్చుచుండ కన్నె తానీడేరి రూపమునుజూచి భ్రమసి చక్కని గుణసంపన్నుని యేరి కోరుకొనఁజాలకుండుటలిందు లేవు) పుట—14.

(౯) సక్రమంబుగ సతుల్ సంతతిం గనుటచే
సక్రమసంతాన మబ్బకుంట,

(ఈ పై చెప్పిన విధముగా భర్తలనెవరికొన నవసర మేలేక; వారుకాదని వీరుకాదని మాసరాలములోనగాక పితృదులు విచారించి చేసినభర్తను క్రమముగా పొంది కుక్షించి క్రమసంతానముందెదరు) పుట—17.

(౧౦) కామశాంతికి పాడుకడగండ్లఁ బొరయమిఁ
జిలిపిరోగాలచేఁ జిక్కకుంట,

(కామముదయించునాఁటికి కామినీ కాముకులకు దాంపత్యసిద్ధి కలిగియుండె నేని పెడదారులఁ బట్టక చిలిపిరోగము లెఱుంగకుందురు) పుట—35.

(౧౧) మాదిసి స్వయంవరంబున తప్పఁ గతిఁబట్ట
జాతిసాంకర్యముల్ జరుగకుంట,

(ఈడువచ్చి పెద్దవారలై స్వయంవరణశక్తినిగడించి యన్యజాతులను గోరుకొన్న (తుక్కిణమ్మ జానికమ్మ సరోజనమ్మలు మున్నగు) యనేక నిదర్శనములవల్ల సంకరజాతులు గల్గుచున్నవి) పుట—13.

(౧౨) చిఱుతనాఁ డొనరించు పరిణయంబు లనాది
యాచారసంపద నమరియుంట,

(ఈబాల్యవివాహాచారము కడుంగడుఁ బురాతనము గాన యిందేదైన బాధకము నిజముగా నున్నయెడల నేనాఁడో త్రోసివేయబడియుండెడిదే. గాన దీని నిప్పుడు తాఁకగూడదు.)

(౧౩) అట్టి పెండ్లిండ్లలోఁ జెట్టచెడుగులు లేమి
చే ననపాయతఁ జెలఁగుచుంట,

(ఈ యాచారము నేఁటివరకు జీవించి ప్రజలలో ప్రచారము వహించి యున్న హేతువే యిందలి ప్రయోజనమును నిరపాయతను జాటుచున్నది)

(౧౪) వేలకువేలేండ్లు పాలింపఁబడు ధర్మ
పద్ధతి నిర్దోష మగుచునుంట,

(ఎన్నెన్నివేల యేండ్లనుండియో యవిచ్ఛిన్నముగా నీ యాచారములు రాగలిగియుంటయే, వాటిలోని నిర్దుష్టత్వమును చెప్పక చెప్పుచున్నది)-

(౧౫) కన్నె భర్తను గోరఁగాదని పెడదారిఁ
బడక తప్పించి కాపాడుచుంట,

(భర్తలను గోరుకొనుపని కన్నెలకిచ్చిన తురకలను సీమవారలను నానాజాతుల వారిని గోరుకొని పిదప పశ్చాత్తాపతప్తులై చెడిపోకుండ కట్టుబాటు చేయుచున్నది)

(౧౬) ఏడెన్మిదేండ్లకే చూడ కన్నెలు భర్త
యననేమొ చక్కఁగా నరసియుంట,

(వస్తువిజ్ఞానము మానవులకు యేడుయెన్మిదేండ్లకే కలుగునని శాస్త్రవేత్తలందఱు నేకగ్రీవముగా నంగీకరించుటచే కన్నె భర్తయననేమో యెఱిఁగియుండును.

(౧౭) కన్నెకు ఋతుచిహ్నగాక సంతానార్హ
లక్షణ మింకొండు గ్రాలకుంట,

(ఋతుమతియగుట దక్క వేఱొండు సాధనమేదియుగూడ కన్నెయొక్క సంతానార్హతా సంభోగార్హతలను నిరూపించజాలియుండకపోవుటకూడ హేతువగుచున్నది.)

(౧౮) వనితమానంబుఁ గాపాడఁజాలినభర్త
చిననాఁటఁ బడయుటే శ్రేయమగుట,

(నా భార్యయని చెప్పుకొనుచు చిన్ననాఁటినుండియు సంరక్షింపజాలిన ప్రేమరసోపాధ్యాయుని చిఱుతనాఁడే పడసియుంట క్షేమంకరం బగుచుండును)

(౧౯) చిఱుత పెండ్లిండ్లలోఁ జెన్నారుసుఖము చే
వ్యభిచారదుర్వృత్తి వరలకుంట,

(సకాలములో వెదకికొనకుండ మగనిబడసి కామోపశాంతిని గనుచుండుట కవకాశము నిచ్చుటచేత దుర్వృత్తి కిం దేమాత్రమేని యెడము లేకుండుట తటస్థించును )

(౨౦) ఈనాఁటిసంఘంబు హేయసాధనసినీ
మాదులఁబడి కీడు నూఁదియుంట,

(అట్లుగాకున్న ప్రస్తుతకలికాల నవీననాగరకతలలో మునింగి విశృంఖల ప్రేమకల వారగుటచే కన్నెలు త్వరలో చెడిపోవుటయో నిందలపాలగుటయో సంభవించును.)

(౨౧) తమపిల్ల లేదారి తప్పిపోదురో యంచుఁ
బితరుల మది వెత లతకకుంట,

(10 యేండ్లకు సమర్తాడినపిల్లలను ఈ కలికాల ప్రవాహములోఁబడి కొట్టుకొని పోకుండ నెట్లు 14 యేండ్లవఱకుఁ గాపాడగలమా యను దుర్భరదుఃఖము తలిదండ్రులకుండదు.)

(౨౨) చిఱుతనాఁటనె భర్త నరసియుంచినఁ గన్నె
కనురాగ మొక గుంజఁ గట్టుపడుట,

(చిఱుతనాఁటనె భర్తను బడయఁగల్గెనేని ప్రేమసామజమునకు తొండమువలె చంచలముగానట్టి యొక్కయాలానము దొరకుచున్నది.)

(౨3) ఇంద్రియంబులు దూఁగి తంద్ర గొల్పును గాన
తచ్ఛిఖాబంధన ధర్మ మగుట,

(మోహము బలవంతమగునుగాన మానవులకు తంద్రఁ బుట్టించు గావున వాని నొక్కయెడ పెందలకడ కట్టియుంచుట మంచిదేయగును.) పుట 40.

(౨౪) బుద్ధిప్రభాపూర్ణపురుషులు పుట్టుట
బాల్యవివాహంపుఫలిత మగుట,

(బాల్యవివాహమువల్ల బుద్ధిక్షీణత కలదనుటకు తగు నాధారములు లేక బ్రాహ్మణులలోనే యీనాఁటికింగూడ కొంతబుద్ధిబలము నిల్చియేయుండును.) పుట 3.

(౨౫) యూరోపియన్‌దురాచారముల్ ద్విజులను
మసకపఱుచు నటించుఁ బలుకుచుంట,

(పాశ్చాత్య వ్యామోహముచే నక్కడ గగ్గోలుపఱుచు వివాహపద్ధతుల నిక్కడికి దించుట మురికిపనియని పాశ్చాత్యవిమర్శకులే యొప్పుకొనుచున్నారు.) పుట 4.

(౨౬) బాల్యవివాహసాఫల్య మొందినచోట
దేహబలం బెంతో తేజరిలుట,

(బాల్యవివాహము లాచారములై యున్న తావులం దన్నియెడలలోనో బాహు
 మపార మైయున్నది.) పుట 5.

(౨౭) మనవివాహములు సఫలములా యను సంది
యంబు పాశ్చాత్యులయందె యుంట,

(మన పాశ్చాత్యసోదరులు చేసికొను పెండ్లిండ్లవల్ల ఫలితము లేనేలేదని వారే
ఒప్పుకొనుచున్నారు.) పుట 6.

(౨౮) ముదిపెండ్లి వెనుచేటు లొదవించు నని ఋషుల్
గని బాల్యపరిణయ మునిచియుంట,

(అక్రమసంతానము విహావిచ్ఛేదము మొదలగు కీడులకు లోనగునని మనఋషులు
స్మృశాస్త్రములందు విధించిన దానిని మానరాకుండెనట)

(౨౯) జనసంఖ్య క్షీణింప వనటఁ గుందిన ఫ్రెంచి
దేశదుర్దశ వెతల్ దెచ్చుచుంట,

(వివాహబంధమును తెగ సడలించి యవిలంబిత రహస్యవివాహములఁ దొప్పదోగి
నాభా సగపశి యల్లాడు ఫ్రెంచిదేశము ప్రత్యక్షసాక్షి యగుచున్నది) పుటః 10.

(30) మన సమష్టికుటుంబమును వృద్ధి గొల్పఁగాఁ
దగు పద్ధతిని జూపఁ దగియయుంట,

(ఈ యాచారము సమష్టి కుటుంబపద్ధతుల వృద్ధి నేయును గాన దీనిని తొలగించ
రాదని స్పష్టమగుచున్నది)

(3౧) ముదికోడెకాండ్రు గీమునుజూచి బెగడొంది
యడ్డగోలుగ సుఖం బరయుచుంట,

(ఇతరదేశములలో వలె ఇల్లునొల్లని కోడెకాండ్రు ఈడేరి పెండ్లిండ్లుగాక
కిరీగానున్న కన్నెల చెడగొట్ట వీలుకలుగుచున్నది)

(3౨) ఆలుమగల్ తమ యన్యోన్యభావంబు
లలవరించెడి వీలు లమరియుంట,

(చిన్నవయసులో భావములు గిటసబాలిక మార్దవముతో నుండునుగాన నట్టివేళఁ
బెండ్లాడుటచే ఒకరిభావము లొకరికి సరిపుచ్చుకొన వీలుకలుగుట) పుట-18.

(౩౩) కాంతుండు ప్రాక్తనకర్మలబ్ధుఁ డటన్న
యౌదార్య వనితల కొదవుచుంట,

(అడవి యుసిరిక కడలి యుప్పువలె భార్యాభర్తలు ప్రాక్తనకర్మచే లభించిరని నమ్మకములు సాంసారికసుఖమునకు సహాయకారు లగుచున్నవి) పుట-18.

(౩౪) పిననాఁడె యొకభర్తఁ గని వాని వృద్ధికై
కన్నె మానసపూజఁ బన్నుచుంట,

(ఈయాచారము మన కన్నెలయందు భర్తృక్షేమార్థమై పూజలవ్రతముల నియోగించి ప్రేమను బెంచి, స్త్రీలలో బ్రహ్మచర్యతపస్సునకవకాశ మొసంగుచున్నది) పుట-20.

(౩౫) మాసరా పెండ్లిండ్లు మన దేశసంఘ శు
ద్ధి ధ్వంసకములంచుఁ దెలిసియుంట,

(ఈ మాసరా పెండ్లిండ్లుచూచి హిందూమానసకమలముల జలదరించును గాన నట్టి సంఘనాశకరములకు మన మౌర్వజాలము) పుట-17, 26.

(౩౬) ఉష్ణదేశములలో నున్న వారికిఁ జిన్న
నాఁడె కామము గింజుకొదుచుంట,

(వేఁడి దేశములలో నాఁడుపిల్లలకు 9, 10 యేండ్లకే కామోదయము (రజస్వలా చిహ్నము) నందుటచే బాల్యవివాహము లావశ్యకములని తేలుచున్నది) పుట 35.

(౩౭) బాల్యవివాహముల్ పరఁగుచోటులలోన
శిశుమరణంబులు పొసఁగకుంట,

(ఈ యాచారముగల దేశములలో శిశుమరణములు కడుంగడు స్వల్పమని యిది వఱకే నిరూపింపబడినది, విలంబిత వివాహములలోనే యిట్టి యనర్థము మెండుగా నున్నట్లు ఋజువుచేయబడెను) పుట-24.

(౩౮) నల్లువారిన హేయ సాంసారిక ప్రేమ
పశులక్షణముపాటిఁ బరఁగుచుంట

(ఎక్కడకని అక్కడనే పాఱవేసి దూడని పాటిపోవు పశుపక్షి జాతులందువలె వివాహబంధ దార్ఢ్యమెఱుంగని నల్లుగన్న వివాహములు మానవులకన ర్హములు) పుట-29.

(౩౯) పెండ్లిండ్ల సరిపోవు విడుదలలుండెడి
యమెరికా గని భీతి నందుచుంట

(ఎన్ని పెండ్లిండ్లు జరిగెనో అన్ని విచ్ఛేదములగుచు వివాహబంధమే నున్నపడిన దేశములు భీతిగొల్పుచుంటచే ఈశాసనము వలయు) పుట-30

(౪౦) పదుమూఁడుతడవులు మగలవిడుదలఁ బెట్టి
'కొరయేట్సు' మది భీతిఁ గొలుపుచుంట,

("కొరయేట్సు" వంటి దొరసానులీ భారతభూమి పైనింక నుదయింపకుందురుగాక)

(౪౧) చెడుగుండెగల స్త్రీలు చిఱుతగండులు దిద్ది
జీవించుమని శ్రుతుల్ చెప్పుచుంట,

(వేదములు స్త్రీహృదయమును గుర్తెఱింగి సుఖింపుమని మందలించుచున్నవి)

(౪౨) కొమ్మలతార్మ్యాలు కొంచెవలపులఁబట్టి
కొమ్మనాఁడే కట్టఁగూడియుంట,

(మొక్కగా వంగనిది మానై వంగదు గాన కొమ్మనాఁడే స్త్రీలవలపు దిద్ది సన్మార్గములోఁ బ్రవేశపెట్టవలెను)

(౪౩) వర్ధమానదశావివాదంబులోఁగల
వ్యర్థతర్కము లసత్యంబు లగుట,

(ఈ తర్కములోని పుష్టిని ఖండించి యిది యంతయు నసత్యబద్ధమని నిరూపింపబడినది) పుట_34-35.

(౪౪) ఈడు మించినకన్నె పోఁడిమిచెడి గర్భ
నాశముల్ ముదిరి యనర్థమగుట,

(ఈ విషయమై వైద్యులయభిప్రాయములతో సహా నిరూపింపబడినవి) పుట_36.

(౪౫) ఈడేరుకన్నెలఁ గూడకున్నపుడు జీ
వాణువిధ్వంసంబు లలరుచుంట,

(విలంబిత వివాహములవల్ల జాతిధ్వంసము దేశధ్వంసము చేసినవార మగుదుమని సప్రమాణముగాఁ జూపింపబడినది) పుట_37-38.

(౪౬) చిననాఁటి పెండ్లిండ్లచే నక్రమేంద్రియ
నిగ్రహార్తికి వీలు నెగడకుంట,

(ఈ విషయముగూడ చర్చింపబడినది. దాని నింకొకతూరి పరిశీలింపఁ బ్రార్థితులు)

(౪౭) క్రమమెఱింగి సుఖించుగతిఁ జూపుచుంటచే
నతిలోలతాదోష మతకకుంట,

(అతిలోలతాదోషము బాల్యవివాహములలో కంటె విలంబిత వివాహములందెంత యవకాశము కలదని సహేతుకముగా వ్రాయబడినది) పుట_45.

(౪౮) కొన్ని దేశములలో కన్నె లాతేండ్లకే
కాపురంబులు సేయఁగలిగియుంట,

(ఈ దుర్దశాపరిపాకము వింతగానున్నను( జరిత్రకారులు తాము చూచి ప్రకటించిరి గాన బాల్యవివాహము లీచేటు దప్పించును)

(౪౯) చనుకట్టురాని కన్నెను బెండ్లియైనట్లు
వేదముల్ సాక్ష్య మిప్పించుచుంట,

(చాక్రాయణమహర్షి చరిత్ర వ్రాసి యుంటిని. తిరిగి చదువ బ్రార్థితులు. వేదసమ్మతమైన బాల్యవివాహముల నడ్డగించుట మతద్రోహము)

(౫౦) సీత కెన్మిదియేండ్లు శ్రీరామునకుఁ బదా
తేం డ్లుండఁగనె వారి పెండ్లి యగుట,

(రామాయణయుగము నాఁటికే బాల్యవివాహము లున్నట్లు ఋజువు చేయఁబడినది

(౫౧) తరుణిసంభోగసంతానార్హతలు గన్న
దన రజస్వలచిహ్న మగుచునుంట

(ఈ విషయమై వైద్యశిఖామణు లిచ్చిన యభిప్రాయమును వ్రాసి చూపితిని)

(౫౨) పెండ్లాడి బాలురు విద్యనేర్పుటలు వి
ద్యాక్షేమకరములై తనరి యుంట,

(ఈవిషయమై సింక్లరు మొదలగు వారి యభిప్రాయముకూడ నియ్యఁబడినది)

(౫౩) పిన్ననాఁటనె తాను బెండ్లిఁ జేసికొనంగ
సంపాదనార్థ ముత్సాహ మిడుట,

(ఆర్థికవేత్తలతర్కములఖండించుసందర్భములో నీవిషయము చర్చించబడినది పుట.)

(౫౪) కన్నె పుట్టినిలు వీడు టన్న నోర్వక పతిఁ
గోరకుండనె కాంత లూరకుంట,

(ఈవిషయమై విపులముగా వ్రాయబడినది) పుట ౩.

(౫౫) కన్నవా రమ్మాయిఁ గని వీడలేమిచేఁ
బెండ్లి సేయక యింటఁ బెంచుచుంట,

(ఈవిషయము పుట ౩ లోఁ జూడుడు.)

(౫౬) ఈడేరి తనతండ్రియింట నుండిన కన్నె
పై నిందపడి పెండ్లి పాడువడుట,

(ప్రజలు నిందారోపణపండితులు. ఏదో ఖాళీగాయున్న పిల్లపై లోకులు నిండ మోపుట సామాన్యమే యగుటచే నిందలువడినపిల్లలకు పెండ్లియగుట కష్టమగుచున్నది.)

(౫౭) పెండ్లికి మును తమ పిల్ల లీడేరిన
సంఘబహిష్కృతుల్ జరుగుచుంట,

(ఈసంఘబహిష్కారమునకు వెఱచి కూఁతులకు పెండ్లిండ్లు సేయుచున్నారుగాని నేరుగాదు.)

(౫౮) ముదురు పెండ్లిండ్లచే మురిగి క్రుళ్లెడి పర
దేశాలగతి బుద్ధిఁ దెచ్చుచుంట,

పుటలు—26, 30, 32, 36, 41,

(౫౯) తుదకు వేసరి పాడు ముదిపెండ్లి ద్రోసి పా
శ్చాత్త్యులే వెనుకకు జరగుచుంట, పుట 6.

(౬౦) ఎన్నియో వేలయేండ్లున్న పెండిలి మార్చు
పని హేతురహితమై పరగుచుంట, పుట.

(౬౧) బాల్యవివాహాలఁ బడినజాతుల స్వల్ప
శిశుమరణంబులే చెలఁగుచుంట, పుట 24.

(౬౨) పిదపకాలము గాన పెండ్లిపెండలకడఁ
గాకున్నఁ బెడదారి సోఁకుచుంట, పుట 7.

(౬౩) కొంపవెల్తురుఁ గూర్పఁగోరి జాయాపతుల్
సంతానవాంఛతో జరుగుచుంట, పుట.

(౬౪) గృహబాధ్యతకు జంకి కీడుమార్గముఁబట్టి
పాడరి కడగండ్లఁ బడయకుంట, పుట 31.

(౬౫) పదునెన్మిదేండ్లకే బ్లాకుప్రిఁసునుగన్న
మూఁడవయొడ్వర్డుజాడ గనుట, పుట.

(౬౬) ఇంద్రియస్ఖలనాది హేతురోగాదుల
కవకాశ మియ్యక యలరుచుంట, పుట 44.

(౬౭) ఆలోచనకుఁబాటె యూఁడుది యడుగంటి
పోకుండ వరు నియ్యఁబూనుకొంట, పుట 9.

(౬౮) కడుఁ బురాతనములై కల్యాణదములైన
సంఘపద్ధతి మార్పఁ జాలియుంట,

(పూర్వాచారములను మతములను మార్చుటకు సర్కారువారి కధికారము లేదు గాన చట్టము చెల్లనేరదు.)

(౧౯) మతములతో జోక్య మతికించుకొనమన్న
"మాగ్న కార్టా" ద్రోయఁ బాలుచుంట,

(విక్టోరియారాణి యిచ్చిన చార్టరులోని షరతులకు విరుద్ధముగాన యీచట్టము చెల్లనేరదు.)

(౨౦) రాజ్యాంగముఁ దిద్దఁ బ్రజ లంపువారికి
మతము దిద్దుటలు దుష్పథము లగుట,

(సామ్రాజ్యసభ్యులు రాజ్యాంగము నడిపించుటకుఁ బంపబడిరేగాని వీరు మతముల జోలికి రాకూడదుగాన యీచట్టము చెల్లకూడదు.)

(౨౧) పరిపాలనకుఁ దగు ప్రాతినిధ్యమెకాని
మతముపై నధికార మతకకుంట,

(ఈ సంఘసభ్యులు తమయధికారము నతిక్రమించుటచే నీచట్టము చెల్లనేరదు.)

(౨౨) సంగమం బన రజస్వలపిమ్మటిది గాన
పెండ్లివేడుక మాన్పఁ బీడ యగుట,

(సంస్కర్తలు నిషేధింపదలచినది బాల్యసంభోగమే కావలెనుగాన బాల్యవివాహ కర్మకాండను (Theoritfical marriage ritual) నిషేధించుట తప్పుగాన నీచట్టము చెల్లదగదు.)

(౨౩) నిరపాయ మైనట్టి నియతకన్యాదాన
మును మాన్పుటది రోఁతపనియ యగుట,

(కన్యాదాన మొక వేడుకయేగాన దీని నకారణముగా నిషేధించి దేశజనక్షోభలుఁ జైలులు, జుల్మానాలు పెట్టించు శాసనము అధర్మముగాన చెల్లతగదు.)

(౨౪) అబలాస్వయంవరం బతిశుభదం బన్న
తర్కంబు దూష్యమై తనరుచుంట,

(స్వయంవరమువల్ల ననేక నష్టములు కలవుగాన కన్నెకు తప్పుదారి దాపురించును గాన యీడేరిన పెండ్లిండ్లు పనికిరావు.)

(౨౫) పాశ్చాత్యులే మన బాల్యవివాహముల్
స్తుతియింప చట్టంబు చుట్టుపడుట,

(పాశ్చాత్యులు తమ వివాహంపుగోఁతిలకురోసి మనపద్ధతులు పొగడుచుండ నీచట్టము బలాత్కారముగా చొప్పింపఁబడినదిగావఁ జెల్లదు.)

(౨౬) పరిశీలన మొనర్చి పాఱవేసినముది
పెండ్లిండ్లఁ జొన్పింప వెఱ్ఱియగుట,

(ఈ గోత్రపెండ్లిండ్లు కొన్నియేడులఁ బరీక్షింపఁబడి నిరసింపబడినందున వానినే తిరిగి చొన్పుశాసనము అధర్మము.)

(౨౭) బాలవిధవల సంఖ్యఁ దూలింప నెంచుచో
నిట్టిచట్టము తగనట్టి దగుట,

(బాలవితంతువు లెక్కుడని వారిసంఖ్య దూలింపదలచినచో నీచట్టము పనికివచ్చునా 14 యేండ్లకు మగడుచచ్చిపోకుండ చట్టము అడ్డుపడదుగాన యిది నిరర్థకము.

(౨౮) విధవావివాహాల విధియింపఁ బడనట్టి
శిక్షల నిర్మించి చెండుచుంట,

(ఈచట్టములోఁబెట్టిన శిక్షావిధానమూ బాలవిధవల వివాహచట్టములో వితంతువులే యుండరుగదా, అట్లేల చేయలేదు. గాన నీచట్టమూపనికొఱకు నిష్ఫలము గాన చెల్లదు.)

(౨౯) బాలవితంతునిర్బంధపరిణయశాస
నావశ్యకము బుద్ధి నరయకుంట,

(నిజముగా వితంతువులసంఖ్య తగ్గించదలచిన సర్కారైనయెడల నిర్బంధ విధవా వివాహ శాసనము కావలయును. ఈచట్ట మందుకొఱకు పనికిరానందున నిష్ఫలము.)

(౩౦) ముందు చట్టము ప్రజాముఖమునఁ బ్రకటించి
పిదప సభ్యత గాంచి పొదలకుంట,

(ఇట్టి మతవిషయముల దుస్సాహసముతో నంటుకొనకముం డింగ్లండులోవలె బిల్లును ప్రకటించి ప్రజలనుండి యీపనికై తిర్గి సభ్యుల నెన్నుకొనకుంటచే నిదిచెల్లదు.

(౩౧) పసిపిల్లచావులు బాల్యవివాహజా
తుల మెండనెడిమాట నిలుపకుంట,

(సర్కారువారీవిషయమై సప్రమాణముగ గణితీలు చూపకుండుటచే నీచట్టము చెల్లకూడదు.)

(౩౨) అటులైన బాల్యగర్భాదానములు తప్పు
గాన పెండిలి మాన్పఁ బూనియుంట,

(దేశము క్షీణించుచున్నదని భయము పొడమినచో చిరుతనాఁటిగర్భాధానము నిషేధించుట తప్పుపని యగును.)

(౮౩) అత్యమాయికము కన్యాదానమును మాన్పఁ
దలఁచుటయే రోఁతధర్మ మగుట,

(కన్యాదానము చేసినంతమాత్రముననే దేశమున కనర్థ మేమి వాటిల్లెనో చూపకయే యిట్టిశాసనమున కావశ్యకమును జాటకయె శాసించుటకూడదు గాన చెల్లదు.)

(౮౪) చిఱుతపెండిలివల్ల శిశువు లూడెద రంటు
గణితీలచేఁ జూపఁ గడఁగకుంట,

(ఈ విషయమై సర్కారువారు సరియైన లెక్కల గన్పరచి యుండనందున యీ చట్టము దౌర్జన్యముగాఁ జొన్పింపబడినందున చెల్లకూడదు.)

(౮౫) గణితిలెక్కలు పాడు గారడీ లందురా
వేఱులెక్కలఁ జూప నేరకుంట,

(గణితిలెక్కల నిందించువా రింకేమైన లెక్కలను జూపసలయునుగాని యే లెక్కలను జూపకయే శాసించుట చాలతప్పు.)

(౮౬) బుడుతలచావు లెక్కుడుగఁ దోఁచిన స్వల్ప
సంఖ్యాద్విజులవల్ల జరగకుంట,

(ఒకవేళ శిశుమరణములు దేశమందు మిక్కుటముగా నున్నను అవి స్వల్పసంఖ్యాకులగు బ్రాహ్మణులవల్ల కలిగినట్లు సాక్ష్యమేమియు నిచ్చియుండలేదు.)

(౮౭) దేశంబునందున్న తీవ్రదారిద్ర్యంబు
శిశుమృతిహేతువై చెలఁగుచుంట,

(ఈ దేశమునందు జీర్ణించియున్న దారిద్ర్యమే శిశుమరణములకు హేతువగుచుండ బాల్యవివాహంబుల కారోపించుట తప్పుగాన చట్టము చెల్లదు.)

(౮౮) ఈ హేతువును దాఁచనెంచు పాలకులు బా
ల్యవివాహములఁ బట్టి యూడుచుంట,

(రాజ్యాంగవేత్త లీదేశచరిత్రను బ్రకటించుకొనజాలక దాఁచిపెట్టి బాల్యవివాహముల కారోపించ సాహసించుటచే శాసన మసంబద్ధము.)

(౮౯) తొలిదెబ్బ గొడ్డలితోఁ బెట్టినట్లు ఖై
దులును జుల్మానాలు గలిగియుంట,

(ఏదో ప్రథమదశలో నొక "అనుమతి" చట్టమొసంగక (Enabling act) ఖైదులు జుల్మానాలతో నారంభించుట దుస్సాహసము గాన యిది చెల్లదు.)

(౯౦) కొలఁదిసంఖ్యను మార్పఁగలిగిన చట్టంబు
నం దెంత యావేశ మమరియుంట,

(ఏదో నలుగురి కన్వయించుచట్టమునం దెంతబలవంతపు శిక్షావిధానము పెట్టుటచే
ది తప్పు చట్టము.)

(౯౧) సన్న జాతులను రక్షణసేతు మని పల్కు
ప్రతిన లెచ్చట నెట్లొ పాడువడుట,

(సంఖ్యాధిక జాతులనుండి సన్న జాతుల కాపాడు దీక్షాకంకణము (Protection
of minorities) సర్కారువారు పాడినదేపాటగా పాడుచుండిరే. అది యానాఁ
డేమయ్యెనో!)

(౯౨) వియ్యంకులను జేర్చి వియ్యంపురాంగ్రము
చెఱఁబెట్టుక్రూరత నెఱపుచుంట,

(ఈ పెండ్లిండ్ల పార్టీలను మందలుమందలుగా ఖైదులోనికి తోలించుటకుగా నీ
ట్టము పుట్టినట్లున్నది గాన చెల్లనూడదు.)

(౯౩) బుద్ధిసంక్షీణతఁ బుట్టించు ననుమాట
బ్రాహ్మణులందుఁ గన్పట్టకుంట,

(ఎందరెందరో భరతభూమి నింతవరకు పుట్టిన గొప్ప యాచార్యులందఱు బాల్య
వాహములకు (బుట్టినవారలే గాన నీతర్కము చెల్లదు.)

(౯౪) ఆయువు క్షీణించునను తర్కమున కెట్టి
సాక్ష్య మిచ్చెడిశక్తి చాలకుంట,

(విలంబితవివాహితములు గల జాతులలోకంటె మన జాతిలోనే యాయుర్దాయ
మెక్కుడుగా నున్నది గాన బాల్యవివాహములు ఆయుఃక్షీణకరములనుట తప్పు.)

(౯౫) బల మిచ్చు నని రేపు మాంసంబుఁ బెట్టించు
చట్టంబుఁ బుట్టింపఁ జాలియుంట,

(ఇంతవింత లేనాఁడు స్వప్నమునందైనను తలపెట్టబడని వింతశాసనము లుదయిం
నవి. "విడుదలశాసనము" (Divo.ce act) రాబోవు చున్నది. ఇట్టి విపరీతచట్టముల
భివారు తమ సంఖ్యాబలముచేఁ బుట్టించవచ్చును.)

(౯౬) సామ్రాజ్యసభలోన సౌగతు లుండి య
హింస శాసించిన నేడ్వనుంట,

(సభలోనున్న వారందఱు బౌద్ధులై యహింసకొఱ కవ్వారేని గొఱ్ఱెమేకల దినఁగూడ దని శాసించిన సభాపతుల మానసము లెంత యల్లాడునో ఆలోచించుకొందురు గాక మాకుఁగూడ నట్లుండదా ?)

(౯౭) ఎన్మిదేండ్లకె కన్నె నీయ వచ్చునటన్న
చట్టంబు లందంద జరుగుచుంట,

(కొన్నిచోటుల నతి బాల్యవివాహముల నిషేధించిరి. 8 ఏండ్లలోపు పిల్లల పెండ్లిండ్లు కూడదనుచున్నారే. అట్లు చేసిన చాలదా?)

(౯౮) వైద్యు లిచ్చెడి యభిప్రాయంబు లెంచక
తొందరతో చట్ట మొందియుంట,

(వైద్యులిచ్చినట్టి పక్రమములగు నిర్ణయముల గణింపక నీ చట్టము నడావుడితో నెగ్గించిరి. ఇది చాల తప్పు.)

(౯౯) మనవివాహములె సన్మార్గంబు లని ప్రతీ
చీనాయకులు చాటి చెప్పుచుంట,

(పాశ్చాత్యులే మన పెండ్లిండ్లు మంచివనుచుండ వానిని నిర్మూలింప యత్నించు చట్టము చెల్లదు.)

(౧౦౦) రేపొ మాపొ వుండు రేపి మామతములఁ
దూలింతు రను భీతి దోఁచుచుంట,

(ఇంతఘోర శాసనమును పెట్టజాలినవా రింక మన మతాచార కులాచారముల సాగనియ్యరను నిరాశ ప్రజలలోఁ గల్గించి పాలకుల యందు విశ్వాసము ప్రజలకు నశించుటకు హేతువగుచున్నది.)

తే. గీ. ఔర! లక్షోపలక్షలు కారణములు
బాల్యపరిణయ జన్యసాఫల్యకీర్తి
మిన్నులకు ముట్టఁ జాడుచు నున్నఁగూడ
వినక యీచట్టముల్ మెడ వేయఁదగునె.

చదువరులారా! ఈ పై నుదాహరించిన కారణశతంబులును ఈచట్టమును నిర్హేతుకమనియు, దుస్సాహసమనియు, నిష్ఫలమనియు, అధర్మమనియు నింక నేమోయనియు నిరూపించుచున్నవి. బాల్యవివాహములే దేశ సంఘ జాతిక్షేమంకరము లనియుఁగూడ చాటుచున్నవి.